| |
|---|
| సంవత్సర చందా |
| రు. 12-0-0 |
| విడిప్రతిక 4 అ. |



| |
|---|
| సంపుటము 47 |
| సంచిక 18 |
| 6.1-54 |

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

విజయ పుష్య శుద్ధ పాడ్యమి బుధవారం


## వచ్చేవారం:

[illegible]

# ప్రత్యేకాకర్షణలతో వెలువడుతున్నది.

ప్రత్యేక త్రివర్ణ ముఖచిత్రంతో, ప్రత్యేక వ్యాసాలు, కథానికలు, చిత్రాలు, ఫొటో లతో ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక సంక్రాంతి సంచిక వచ్చేవారం ఆఖరుకే వెలువడుతున్నది. ఈ సంచికలో క్రిందిరచయితలరచనలు ప్రచురించ బడుతున్నవి.

**గేయాలు, పద్యాలు:**

ఆరుద్ర
దాశరథి
పఠాభి
కవికొండల
కొనకళ్ల
నారాయణరెడ్డి
ఉత్పల

★

**కథలు :**

శ్రీ శ్రీ
మల్లాది
కొడవటిగంటి
శ్రీవాత్సవ
రాచకొండ

★

**నాటికలు :**

గోరాశాస్త్రి
ప్రయాగ
హితశ్రీ

**వ్యాసములు :**

ఎస్. ఎస్. వాసన్ (జెమినీ)
వావిలాల
తెన్నేటి సూరి

వీనిలో దాదాపు అన్నీ ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక సంక్రాంతి సంచికకోసం ఈ రచయితలు ప్రత్యేకం వ్రాసినవి. ఇవిగాక రకరకాల చిత్రాలతో ఆకర్షణీయంగా ప్రత్యేక సంచిక ముద్రించ బడుతున్నది.

**64** [illegible]

ఇప్పుడే మీ మీ ప్రతులను ఏజంట్లవద్ద రిజర్వు చేసుకొనండి.

# కాలక్షేపం

తరువు లతి రసఫల భార-గురుత గాంచు;
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘు;
డుద్ధతులు గారు బుధులు-సమృద్ధి చేత;
జగతి నుపకర్తల కిది-సహజగుణము.

తా॥ వృక్షములు ఎక్కువ రసవంతమైన ఫలముల భారముచేత వంగి గౌరవమును పొందుచున్నవి. ఆకాశములోని మేఘములు క్రిందకు వ్రేలాడుచు అమృతమును అనగా నీటిని యిచ్చుచున్నవి. పుష్కలంగా ఉన్నటువంటి బుద్ధిమంతులు అతిశయంతో ఉండరు. జగతియందు పరోపకారపారీణుల కిది సహజ స్వభావము.

సహజసిద్ధంగానే అవి బరువుచేత క్రిందకు వంగుతాయి అని పద్యం ముగింపబడింది. సహజసిద్ధంగానే కాయలున్న కొమ్మ వంగుతుంది. సహజసిద్ధంగానే వాన కురిసే మబ్బులు కొండమీదనుంచి క్రిందికి దిగి వచ్చినట్లుగా, మిన్నునుంచి మన్నుకు సమీపిస్తున్నట్లుగా ఏదో ఒక ప్రాంతాన్ని వరించి ఆవరించి వర్షిస్తాయి. అపని అవి బుద్ధిపూర్వకంగా చేస్తున్నాయి అనేమాట ఆపద్యంలో లేదు. కాని, అవి సహజంగా చేస్తున్నాయి అని ఉంది. బుధులవిషయంలో బుద్ధి అనేది ఒకటి ఉంది. బుద్ధిమంతులు చేసేపని బుద్ధిపూర్వకంగా చేస్తారు. అందువల్లనే వారిని బుద్ధిమంతు లనవలసి వస్తుంది. ఏదో ఒక ఆవేశంలో చేసినపనిని, బుద్ధిపూర్వకంగా చేయలేదని చెప్పగలమా? ఈ విషయంలో లోక్యవ్యవహార ధర్మాధర్మ నిర్ణయం చేసేటప్పుడు, బుద్ధిపూర్వకంగా బాగా ఆలోచించి చేసినపనికిన్నీ, ఆవేశంలో చేసిన పనికిన్నీ తేడా ఉన్నదని న్యాయమూర్తులు కూడా వాదిస్తారు. ఏదైనా ఒక హత్య జరిగినప్పుడు హంతకుడు అట్టి హత్యను బుద్ధిపూర్వకంగా చేయవలెనని నిర్ణయించుకొని, కత్తి చేతబట్టి, ఫలానావానిని నేడు ఫలానావిధంగా చంపవలెనని ఒక వ్యూహం ఊహించుకొని, ఆ వధ యధావిధిగా జరిపినట్లయితే, అట్టిపని బుద్ధిపూర్వకంగా చేసిన ఖూనీ అని తీర్మానించి, సాక్ష్యాధారం కూడా సవ్యంగా సమృద్ధిగా ఉంటే, అటువంటి ముద్దాయికి ముమ్మాటికీ మరణదండన విధించవచ్చునని వాదిస్తారు. కాని, ఆ ముద్దాయి బుద్ధిగలవాడు కాడనుకోండి. వానికి మతి స్థిమితంలేక అప్పుడప్పుడు పిచ్చి ఆవేశం కలుగుతూ ఉన్నట్లయితే, అటువంటి పిచ్చి ఆవేశంలో ఎవనినో ఒకనిని చంపడం సంభవించినట్లయితే, అటువంటివాడు ఆ హత్యను బుద్ధిపూర్వకంగా, నిర్ణీత సంకల్పంతో చేయలేదని వాదిస్తారు. కనుక అటువంటివానికి మరణదండన విధించుటకు వీలులేదు. ఇంకో సందర్భంకూడా ఆలోచించవచ్చు. ఒక నవుకరును గాని, ఒక బిచ్చగాడిని గాని, ఒక అసహాయుణ్ని గాని, ఎవరైనా బలవంతుడు లేదా ధనవంతుడు గర్వాతిశయంచేత పట్టుకొని హింసించి, ఏదో ఒక సందర్భంలో పీడించుచున్నట్లయితే, అట్టి అసహాయుడు ఇక ఓర్చుకోలేక సద్యః కోపావేశ ప్రేరితుడై, తోక త్రొక్కిన త్రాచు కాటు వేసినట్లుగా, తన చేతిలో అప్పటికప్పుడు ఏదిఉంటే అది పుచ్చుకొని దెబ్బ కొట్టవచ్చును. ఆ దెబ్బతో వాడు స్మృతితప్పి పడిపోవచ్చును. అతడు అత్యంత కోప ప్రకోప కారణం కలుగుటవల్ల తలవని తలంపుగా అప్పటికప్పుడు ఒక తీవ్రమైన దెబ్బ కొట్టియుండవచ్చును. కాని చంపవలెననే ఉద్దేశ్యంతో కొట్టియుండకపోవచ్చు. అయితేనేం? ఆ దెబ్బకు వాని ప్రాణం పోయింది. అయినప్పటికీ, తగినంత ప్రేరేపణవల్లనే ఆకస్మిక ఆవేశం సహజంగా కలిగింది. కనుక అదికూడా బుద్ధిపూర్వకంగా చేసిన హత్య కాదు. వేలకొలది జనం సమూహంగా చేరి ఉన్నప్పుడు, ఆ జనసమూహంలో ఏదో ఒక అల్లరి, ఆవేశం, పట్టపగ్గములు లేకుండా సంభవిస్తుంది. ఈ ఆవేశంలో ఒకరి నింకొకరు కొట్టుకోవచ్చు. ఎవరు ఎవరిని కొట్టుతున్నారో తెలియకుండా కొట్టుకోవచ్చు. ఆ కొట్లాటలో ఎవరైనా మరణించవచ్చు. అదికూడా బుద్ధిపూర్వకమైన హత్య కాదు. నడిత్రోవలో చీకట్లో ఎవడైనా దారిదోపిడి దొంగ ఎదురైనప్పుడు, ఆత్మరక్షణకోసం వానిమీద రివాల్వరు పేల్చినట్లయితే, ఆ దొంగ తనమీదకు వస్తున్నాడనే భయంతో పేల్చినప్పటికీ, అది కూడా నిర్ణీత పూర్వ సంకల్పపథకంతో చేయబడిన హత్య కాజాలదు. అది కేవలము హఠాత్తుగా అప్పటికప్పుడు సద్యః ఆత్మరక్షణకై గత్యంతరం లేక చేసిన పని. అంతే కాదు. ఒక సైనికుడు యుద్ధభూమికి వెళ్ళి తుపాకులు కాల్చి దూరంగా ఉన్న శత్రు సైనికులను గాని సాధారణ పౌరులను గాని చంపవచ్చును. అతడు చంపిన మనుష్యులమీద అతనికి ప్రత్యేక విరోధం ఏమీ లేదు. తన దేశజనరక్షణార్థం తుపాకీ కాల్చాడు. అతడు చేసిన హత్యాకాండను అతని ప్రభుత్వం, అతని ప్రజలు, అతని సోదర దేశీయులు హర్షిస్తారు, ఆమోదిస్తారు. అందువల్ల ఆ సైనికునకు మరణదండన లేదు. అతనిపై ఏ విధమైన నేరారోపణ లేదు — అంతేకాదు. అతనిని అతని ప్రభుత్వం గొప్పగా గౌరవించి, అతనికి మహావీరచక్రం బిరుదుగా ఇచ్చి, అటువంటి వీరుడు అరుదని మురిసిపోతుంది.

ఇంతదూరం యీ విషయం కషాయం కాచినట్లుగా, కూలంకషంగా, చర్చించినది ఎందుకంటే, పై జెప్పిన సందర్భములన్నింటిలో జరిగిన పని ఒక్కటే — కాని ప్రతి పనీ ఖూనీ కాదు. కర్మ ఒక్కటే కాని ఆ కర్మయొక్క ధర్మం, తరహా, తరచినకొద్దీ మారిపోతుంది. జరిగిన కర్మయొక్క స్వభావధర్మనిర్ణయం దేనినిబట్టి చేస్తున్నామంటే, బుద్ధినిబట్టి చేస్తున్నాము. ఆ పని చేసినప్పుడు ఏ బుద్ధితో, ఏ ఉద్దేశంతో చేశాడనేది ధర్మనిర్ణయానికి మూలకీలకం. కాబట్టి సంకల్పం ప్రధానం అన్నారు; క్రియ ప్రధానం కాదన్నారు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :— విజయావారి "చంద్రహారం"లో శ్రీరంజని.

కాని, లోకసహజంగా అనే మాట అది కాదు. "క్రియప్రధానం గాని, మాట లెందుకోయ్?" అంటారు. "నీ ఉద్దేశం నీ ఉపదేశం ఎవడికి కావాలి? క్రియ లేని శుష్కప్రియా లెందుకు?" అంటారు. కాబట్టి వ్యవహార ప్రపంచానికి మాటలకంటె, మనస్సులో ఉన్న ఊహలకంటె, క్రియ ప్రధానం. ఎందుచేతనంటె, నీ మనస్సులో దూరి నేను చూచానా? అంటారు. "మాటలకేం? కోటలు దాటుతాయి. క్రియలు గడపలు దాట"వంటారు.

సామాన్య వ్యాపార ప్రపంచమునకు యీ తత్వవిచారణ పెట్టుకుంటే పని సాగదు. మూడు సంవత్సరాల మధ్యకాలంలో ప్రోనోటుమీద వసూలు వేయకపోతే, ఆ ప్రోనోటు అంతటితో రద్దు అయిపోయినట్టే అంటుంది వ్యాపార వ్యవహారలోకధర్మం. కాని, మూడేళ్లు దాటిపోయినప్పటికీ, యివ్వవలసిన అప్పు పైకమును బాకీదారు చెల్లించవలసిన బాధ్యత లేదని వాదింపగలమా? నిజంగా పారమార్థికంగా ఆలోచిస్తే, పుచ్చుకొన్న అప్పు యివ్వగలిగిన స్థితిలో ఉన్ననాడు యిచ్చి తీరవలసిందే. ఆ ఋణం, యీ జన్మలో తీర్చక తప్పించుకొనినప్పటికీ వచ్చే జన్మలోనైనా తీర్చక తప్పదు. కనుక భగవంతుని సాక్షిగా—లేదు లేదు—అణాబిళ్ళ సాక్షిగా తీసికొన్న అప్పు అంతమాత్రంచేత కర్పూరంలాగున హరించి అదృశ్యమైపోతుందా? అప్పు అంటే నిప్పు వంటిదని అంటారు. కాని ప్రోనోటు వ్రాయబడినప్పుడు అది అగ్నిహోత్ర సాక్షిగా వ్రాయబడిన కాగితం అయినట్లయితే, అది అగ్నిహోత్రసాక్షిగా చేసిన కంట్రాక్టు ప్రమాణం అయినట్లయితే, మూడేళ్ళ వాయిదా తప్పిపోయినప్పటికీ, బాకీదారు తానుతీసికొన్న ఋణమును అణాల పైసలతో తెచ్చి బాకీ ఫైసలు చేయవలసిందే. ఈ మూడేళ్ల కాలదోష కాలపరిమితి యీ కాలంలో ఏర్పడిన న్యాయసూత్రమేగాని, యిది సనాతన ధర్మసూత్రంకాదు. నేటి మన లౌకికమైన లా ప్రకారంగా బాధ్యత పోయినప్పటికీ, నైతికబుద్ధితో ఆలోచిస్తే బాధ్యత తొలగిపోదు.

సూక్ష్మంగా నైతికతత్వ విచారణ చేసినప్పుడు బాధ్యత ఒకవిధంగా కన్పిస్తుంది. స్థూలంగా వ్యాపార వ్యవహార సరళిగా చూచినప్పుడు మన బాధ్యత ఇంకోవిధంగా కన్పిస్తుంది. ఏమైనప్పటికీ మన మనస్సాక్షిని ఆధారంగా తీసికొని, మనస్సాక్షినే ఘురానా సాక్ష్యంగా స్వీకరించి, మన స్సాక్షినే వాది తరఫు ప్రథమసాక్షిగా విచారించి, మన తరఫు మన మనస్సాక్షిని మనమే క్రాసుపరీక్ష చేసి, ఇంకో సాక్షిని విచారణ చేయకుండా, ధర్మాధర్మనిర్ణయం చేసి తీర్పు చెప్పడం ఉత్తమం అని తత్వవేత్తలు అంటారు. "మనసా నీకిది మనసా?" అని అడిగి మన మనస్సుకు ఏది నచ్చితే, ఏది మనసైతే, ఆపని చేయవలెనన్నారు.

అయితే, మనమనస్సు సహజసిద్ధంగానే, మనము దానిని ఆ ప్రశ్న అడుగకముందే, మనలను హెచ్చరించి ప్రబోధిస్తూ ఉంటుంది. "పదవే భద్రాద్రికి పాపిష్టి ఘటమా?" అని యీ దేహాన్ని ఆ మనస్సు హెచ్చరిస్తూ ఉంటుంది. కాని, మనలో ఉన్న అంతరాత్మ, మనలోఉన్న మనస్సాక్షి, "పదవే సినెమాకు పాపిష్టిఘటమా?" అని వేధిస్తుంది. టిక్కెట్టు కొనేవరకు తిక్క పెటిస్తుంది. ఇదికూడా మనస్సాక్షి చెప్పి చేయించిన పనియేగాని చెడ్డపని కాదు.

నిజమే. మనమనస్సాక్షికి డాన్సులంటే యిష్టం. లవ్ సీన్లు అంటే యిష్టం. అందులో ముఖ్యంగా అందమైన ఆడతార మొగ వేషంలో నటిస్తే, అర్థంకాని సంస్కృత శ్లోకాన్ని తేటతెనుగు ఆటవెలది పద్యంలోకి తర్జుమా చేసినట్లుంటుంది. అదివరకు అర్థంకాని అనేక అంతరార్థ విషయాలు అతిసులభంగా కరతలామలకంగా అర్థమైనట్లు ఆనందిస్తుంది మన మనస్సాక్షి. కనుక, మన మనస్సాక్షి మనం చదువుకున్న చదువే చదువుకుంది. ఇది మన అస్థిపంజరంలోఉన్న రామచిలుక. మనం ఏపలుకులు నేర్పితే ఆ పలుకులే పలుకుతుంది. దీనికి హుషారు యిచ్చి, కవ్వించి, జనరల్ పవర్ ఆఫ్ అటర్నీ (సర్వాధికారముక్త్యారునామా) వ్రాసిఇచ్చి, మనతరఫు ఏజంటుగా అన్ని విషయాలలోనూ వ్యవహరించవలసినదిగా ఫర్మానా యిస్తే, అప్పుడు యీ పాపిష్టిఘటాన్ని ఆ మన స్సాక్షి భద్రాద్రికే తీసికొని పోతుందో? లేక, ముద్దులుమూట కట్టిన కొత్త ఫిల్ము మొదటిషోకు క్యూలో నిలువబెట్టి, టిక్కెట్టు కొనిపించి, ఆట మొదలుపెట్టేసరికి, హాలులోకి చేరుస్తుందో? ఎవడు చెప్పగలడు? బ్రహ్మయ్యశాస్త్రిగారు బ్రాందీ తాగితే, ఆయన నోటవెంట ఉపనిషత్సారం ఆరాత్రి అదేపనిగా ఆసుధారగా వస్తుంది.

# ★ కాలక్షేపం ★

యూనాదికొండడు ఒకదొప్ప ఏకొలువ గట్టుమీద ఏ తాటితోపులోనైనా పుచ్చుకున్నా 'డంటే, పంచ మహాపాతకపుర పురాతన పంచాంగశ్రవణం అచ్చ తెనుగులో ఉచ్ఛస్థాయిలో జరుగుతుంది. లోపల ఉన్న చిలుక అక్కడ ఒకమాదిరిగా పలికింది. ఇక్కడ ఇంకోమాదిరిగా పలికింది.

మనస్సాక్షి అనేది మనలో ఉన్న రత్నమే కావచ్చు. కాని, దాని సహజరత్న కాంతి రమ్యంగా ప్రకాశించాలంటే దానికి మనం సానబెట్టించాలి. అదే సంస్కారం.

ఈ సంస్కారం ఏవిధంగా ఉంటుందో మనస్సాక్షియందు ఆసంస్కారం ఆవిధంగా సాక్షాత్కారం అవుతుంది. అప్పుడది మన సహజగుణం అంటారు సహజస్వభావంగా మారిపోయి మనిషిలో జీర్ణించిపోయి సంస్కార రూపంగా ఉండేటటువంటి పరోపకార గుణం కావాలి. అటువంటి సహజసిద్ధమైన పరోపకారగుణం పరమోత్కృష్టమైనదనే మాటకు ఏవిధమైన లోటు లేదు.

చెట్లు ఏ విధంగా పండ్లు సహజంగా పండించి మనకు క్రిందకు అందిస్తున్నాయో, ఉపకారబుద్ధి సహజంగాఉన్నటువంటివాడు ఇతరులకు ఉపకారం అయాచితంగా, ఇతరులు కోరకపూర్వమే చేస్తాడు. ఏలూరులో కొన్నాళ్ళ క్రిందట ఒక కొబ్బరిచెట్టుమీద సమృద్ధిగా కాయలు కాచిఉన్నాయి. ఆ కాయలలో ఒకటి పండి హఠాత్తుగా క్రిందపడింది. 'ఆ సమయంలో ఆ చెట్టుక్రింద ఒక అమాత్య శేఖరుడు ఒక ప్రజానాయకుడు సుఖాసీనుడై సభ చేస్తూఉంటే, ఆ కాయ ఆ నాయకుని ప్రక్కనే అయాచితంగా పడింది. ఆ కొబ్బరిచెట్టుయొక్క సహజగుణం అది. రసభరితమై పండిన పండును మనకు "ఇదిగో! తీసుకోండి! మధురఫలంబులు - మదికింపువీరగ" అని అర్పిస్తుంది. కాని, ఈ కొబ్బరికాయ పడటం చూచి ఆనందించిన వాళ్ళు ఆనాడు ఆ పండిత సభలో ఎవ్వరూ లేరు. సభలో ఉన్న అమాత్యశేఖరునకు ఇదిగో ఫలప్రదానం అన్నట్లుగా ప్రక్కనే అది పడినప్పటికీ, అందు కెవ్వరూ ఆనందించలేదు. ఆయనకు ఆనాడు ప్రాణగండం తప్పినందుకుమాత్రం సభికులు సంతోషించారు. మేఘుడు ఆకాశంనుంచి వ్రేలాడుతూ ఆకసము చిల్లిపడినదో యనినట్లుగా వర్షిస్తే, తత్ఫలితంగా ఇటీవల గోదావరి పొంగి ప్రవహిస్తే, ప్రజలు పడరానిపాట్లు పడ్డారుగాని పరమానందభరితులు కాలేదు. ఇవన్నీ భగవద్విలాసములేగాని, మరొకటి కాదు. అపును ఆమాట అంగీకరించవచ్చు. కాని, భగవంతుడు ఆ పనులు ఎందుకు చేశాడో, ఏ సత్సంకల్పంతో చేశాడో, మనకు తెలియదు. ఆ సంకల్పం ఏమిటో తెలియక, ప్రస్తుత ప్రయోజనమే ప్రధానంగా పరిగణించి, భగవంతుణ్ని దూషించడం దూరదృష్టిలేని దుషలక్షణం. సరియైన పరమార్థదృష్టిలేనందున, అది మన దురదృష్టమని భావిస్తాం. వీలైతే నష్టపరిహారానికి ఈ అతివృష్టికారకుడైన సృష్టికర్తమీద దావా దాఖల్ చేస్తాం.

బుధజనవిధేయరావు అనే ఆయనకు గల ఉపకారబుద్ధిని చూచి నిజంగా రసఫలభరితములైన వృక్షములూ, నింగివ్రేలుచు నమృత మొసంగు మేఘుడు కూడా బుద్ధి తెచ్చుకోవాలి. ఆయన పార్కులో రేడియో వినివస్తూఉండే సమయంలో అక్కడ ఒక బల్లవద్ద రిస్టుగడియారం ఒకటి దొరికింది. అది చాలామంచి మేలుజాతిరిస్టువాచి దానిమీద "వాచస్పతి రావు" అనే పేరు చెక్కబడి ఉంది. అది చూచేసరికి బుధజన విధేయ రావుకు "హా! తెలసెన్"అన్నట్లయింది. బోధి వృక్షంక్రింద ప్రబోధం కల్గినట్లయింది. వాచస్పతిరావు అతనికి ఆప్తమిత్రుడు. ఆనాడే మద్రాసుకు పనిఉండి అర్జంటుగా ప్రయాణమై వెళ్ళాడు. ఇతడు గడియారం పరికించి చూచాడు. అటు ఇటు ఆడించి చూచాడు. తిరగడంలేదు. కొంచెం దెబ్బతిన్నట్లుంది. అతని మిత్రునకు ఆ గడియారం బాగుచేయించిపిమ్మట పార్సెలుచేసి పంపిద్దామనియెంచి, తానెరిగియున్న వాచిసంస్కర్త కొకనికి ఒప్పగించాడు. అది అంతర్గత బహు రత్నఖచితవాచి. ఈ వాచిసంస్కర్త అందులోని కొన్ని మేలుజాతిరత్నఖచిత యంత్ర భాగములనుతొలగించి దొంగిలించి, తంత్రంచేసి, ఆ యంత్రం తిరిగి తిరిగేటట్లు మాత్రం చేశాడు. గడియారం బాగా ఆడుతోంది. పనివాని కివ్వవలసిన పదిరూపాయీలు తానే పరోపకారబుద్ధితో యిచ్చి ఆ రిస్టువాచీని పోస్టులో పార్సెలుచేసి వాచస్పతి రావుకు పంపించాడు. అది తనకు దొరికిన సంగతీ, శ్రద్ధగా మరమ్మతు చేయించిన సంగతీ సవిస్తరంగా ఉత్తరం వ్రాశాడు. ఆగడియారం అతని మామగారు అతనికి కొనియిచ్చిన గడియారం. ఒకసారి భార్యను పుట్టింటికి పంపి భీష్మించి, రిస్టువాచి కొనియిస్తేనేగాని తన అర్ధాంగిని మళ్ళీ తన యింటికి ఆహ్వానించనని తన మామగారికి వాచస్పతి శ్రీముఖం పంపించాడు. ఆ సందర్భంలో అతనికిది లంచంగా సమర్పించాడు ఆ మామగారు. ఇప్పుడీ గడియారానికొక గండం తప్పిందిపార్కులో. దానినే అతని మిత్రుడు మరమ్మతు చేయించగా, దానిలోని రత్నయంత్రాలూ, యంత్రరత్నాలూ అంతర్ధానమైనాయి. నెలరోజులు సరిగ్గా తిరిగి, బయటచేరినట్లుగా, మూలపడింది. అప్పుడతడు ఆగ్రహం పట్టలేక, కించిత్తయినా మొహమాటం లేకుండా, బుధజన విధేయ రావుకు రిజిస్టర్డు నోటీసు యిచ్చాడు. "నా రిస్టువాచీ విషయంలో నీవు అనవసరంగా జోక్యం కలుగజేసికొని మరమ్మతు చేయించావు. దానిలోని విలువగల యంత్ర భాగాలు అంతర్ధానమైనాయి. మంచి చక్రములుపోయి చెడ్డచక్రములు వచ్చాయి. ఇదంతా నీవల్లజరిగిన అక్రమము. ఈ వాచి అసలు ఖరీదు రూ 300. దానిఖరీదుకు తగిన నష్టం అంతా నీవే భరించాలి. ఈ వాచీ పూచీ నీవు అనవసరంగా పెట్టుకొన్నందున ఆనష్టం నీవే పెట్టుకోవాలి"అని వ్రాశాడు. లోకన్యాయప్రకారంగా ఆ నష్టం అతనే యివ్వాలి.

ఆ ఉత్తరాన్ని బుధజనవిధేయరావు తన మిత్రులకు చూపించాడు. వాళ్ళందరూ వాచస్పతినిపిలిచి మొహంవాచేటట్లుచివాట్లు పెట్టారు. ఈ వాచీ మూలంగా భార్యతో పోట్లాట. మామగారితో పోట్లాట—ఆఖరుకు ఆప్తమిత్రునితో పోట్లాట—ఇన్ని సంభవించాయనే అసహ్యంతో, అంత ఖరీదుగల వాచీలవల్ల చాలా పేచీలు వస్తాయనిగ్రహించి, దానిని పూర్తిగా గర్హించి, ఒక వాచీసంస్కర్తకు తోచిన వెలకు అమ్మివేశాడు. బుధజనవిధేయరావువల్ల అంతవరకూ అతడు తనకు జరిగింది అపకారం అనుకున్నాడు. కాని యిప్పుడు తన ఆప్తమిత్రుడు తనకు చేసింది ఉపకారమే అని ఊగ్గడించాడు. "జగతి నుపకర్తలకు నిది—సహజగుణము" అని అవగాహన చేసికొన్నాడు. ★

# జోరీగ సంగీతం

చీకటిపడింది. నాటకరంగంమీదనుంచి ఆఖరి నటుడుకూడా నిష్క్రమించినట్టు, ఆఖరి సూర్యకిరణంకూడా అంతర్ధానమైంది. శూన్య రంగస్థలిమీద తెరవాలినట్టు, చీకటి తెర పరుచుకుంటోంది. బీచిలో నెమ్మదిగా జనం తగ్గిపోతున్నారు. ఒక్కణ్ణీ కూర్చుని నిర్నిద్ర సముద్రతరంగాలు చేసే ఘోష ఏ భాషకి చెందిందా అని ఆలోచిస్తున్నాను.

తలెత్తి చూస్తే విశాలమైన ఆకాశం. మేఘవసనధారిణియైన యామినీ భామినికి ఏ విశ్వప్రేమికుడో కానుకగా యిచ్చిన నఖక్షతాల్లాగ నక్షత్రాలు మెరుస్తున్నాయి.

ఈ బీచికి యింతమంది జనం ఎందుకు వస్తారో. దేనినుంచో తప్పించుకుందామని ప్రతివాడికీ వొకటే తపన. ఇరుకు యిళ్ళనుంచి, మురికి సందులనుంచి, విసుగుదలనుంచి, ఈతిబాధలనుంచి, స్నేహితులనుంచి తప్పించుకోడానికి చిన్నపట్నం బీచికంటె మంచిస్థలం యింకోటి దొరకదు. అదిపెద్ద *Asylum* లాంటిది. ఈ జనమంతా కాందిశీకులు.

నిజానికి ప్రతిమనిషీ ఒక కాందిశీకుడిలాగే కనిపిస్తాడు. ముఖ్యంగా ఏదో వొక వ్యాపకంలో తీవ్రంగా, అతిగా అభినివేశం కనబరచే మనుషుల్ని చూస్తే నాకు చెడ్డ అనుమానం. దేన్నుంచి పారిపోవడానికి వీరు ప్రయత్నిస్తున్నారా అని ఆలోచిస్తాను. ఒకడు ఎప్పుడూ రాజకీయాలే మాట్లాడతాడు. ఒకడు కనిపించిన ప్రతి చెత్త పుస్తకం చదివేస్తాడు. ఒకడు అస్తమానం బొమ్మలు గీస్తూ కూర్చుంటాడు. ఒకడు వచ్చిన ప్రతి కొత్త సినిమా చూసేస్తాడు. ఒకడు నిరంతర సౌందర్యాన్వేషకుడు. ఒకడు నిత్యరంధ్రాన్వేషి. ఒకడు మానవ ద్వేషి. ఒకడు హ్యూమనిస్టు. ఇంకోడు హ్యూమరిస్టు. ఒకడు మార్క్సిస్టు. వేరొకడు ఎనార్కిస్టు.

ప్రతివాడూ ప్రస్తుత స్థితినుంచి దాటిపోవాలనే ప్రయత్నం. వడ్డించిన విస్తరిలాంటి జీవితంగల కవి శోక గీతాలు తప్ప పాడడు. శోకం తప్ప మరేమీ యెరగని కవి భవిష్యత్తును ఉజ్వల వర్ణాలలో చిత్రిస్తూ ఊపిరిపోసుకుంటాడు.

"*Man does not live by bread alone*" అంటాడు ధనవంతుడు. "*Man lives by bread alone*" అంటాడు దరిద్రుడు. జీవితం సంఘర్షణల మూట; ద్వంద్వాల కోట.

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. దూరంగా కుక్కలు అరుస్తున్నాయి. ఈ కెరటాల్లాగే మనస్సులో ఎన్ని ఆరాటాలు! బెస్తెడు నేలకోసం ఎన్ని పోరాటాలు! జానెడు పొట్టకోసం ఎన్ని కొమాటాలు!

*        *        *

సందేహాలు తయారుచెయ్యడం ఎంత తేలికో, సమాధానాలు చెప్పడం అంత కష్టం.

చెట్టు ముందా, విత్తు ముందా? కోడి ముందా, గుడ్డు ముందా? కృష్ణుడికి మీసాలుండేవా, లేవా? మూడో ప్రపంచయుద్ధం వస్తుందా, రాదా? ఇవన్నీ ప్రశ్నలే. అందర్నీ సంతృప్తిపరిచే జవాబులు దొరకవు.

ఇలాంటిదే ఒక ప్రశ్న. వ్యక్తికంటె సంఘం ప్రధానమా? సంఘంకంటె వ్యక్తి ప్రధానమా? ఈ ప్రశ్న రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికరంగాలన్నిటిలోనూ ప్రవేశించింది.

వ్యక్తి ప్రధానమనేవారు "సంఘమంటే వ్యక్తుల సమూహం. వ్యక్తి లేందే సంఘం లేదు. సంఘమనేది *abstraction*. దాని పేరుతో కొందరువ్యక్తులు అధికారం చెలాయిస్తారు. అది నిరంకుశత్వం," అంటారు.

సంఘం ప్రధానమనేవారు "వ్యక్తి సంఘంలో ఒక భాగం. సంఘం లేందే వ్యక్తిలేడు. వ్యక్తికూడాఒక *Abstraction*. వ్యక్తిపేరుతో ఒక వ్యక్తో, కొందరు వ్యక్తులో అధికారం చెలాయిస్తారు. అది నియంతృత్వం." అంటారు.

ఇలాంటిదే ఇంకో ప్రశ్న. నన్నయ గొప్పకవా, తిక్కన గొప్పకవా? నన్నయలో *Song rythm*. తిక్కనలో *Speech rythm*. నన్నయ శబ్దాలు పాడతాయి. తిక్కన శబ్దాలు మాట్లాడతాయి. నన్నయలో హృదయాన్ని స్పృశించే సౌకుమార్యం. తిక్కనలో మెదడును పలకరించే గాంభీర్యం. నన్నయలో శిఖరాలూ, అగాధాలు. తిక్కనలో విశాలమైన మైదానాలు. నన్నయలో సంస్కృతం. తిక్కనలో తేటతెలుగు. ఆయన కవుల కవి. ఈయన పతితల కవి. ఇద్దరిలో ఎవరుగొప్ప?

ఎవరు గొప్ప కవో తేలందే కొందరికి నిద్రపట్టదు.

కొంచెం చిన్నదైనా మరొక ప్రశ్న. కృష్ణశాస్త్రి గొప్పకవా? శ్రీశ్రీ గొప్ప కవా? కృష్ణశాస్త్రి భావకవి. శ్రీశ్రీ జీవకవి. ఆయన వీణ వాయిస్తాడు. ఈయన భేరీ మోగిస్తాడు. "సంధ్యావసాన సమయమున, నీపపాదపశాఖికాగ్ర పత్రకుటిల మార్గముల లోపల వసించు యిరుల గుసగుసలు" కృష్ణశాస్త్రికి వినిపిస్తాయి. "రాంబందుల రెక్కలచప్పుడు, పొగగొట్టపు భూంకార ధ్వని," శ్రీశ్రీకి వినిపిస్తాయి. ఇద్దరూ జీవితంలో దుఃఖాన్నే దర్శించారు. అయితే కృష్ణశాస్త్రికి దుఃఖం ప్రేయసి. శ్రీశ్రీకి దుఃఖం రాక్షసి. కృష్ణశాస్త్రి తన్ను లోకం ముల్లుతో గుచ్చిందని నొచ్చుకుని "ఏటి పని యిది లోకమా! హృదయదళన దారుణ మహోగ్రకార్యంబు దలచినావు," అని లోకాన్నే నిరసించి, యెగసి యెగసి "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అంటాడు. శ్రీశ్రీ "ఒక జాతిని వేరొక జాతీ, ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ పీడించే సాంఘిక ధర్మాన్ని" నిరసించి, బాధాసర్పదష్టులైన తోటి ప్రజలకి జగన్నాథ రథ చక్రాల ఆగమనం ప్రకటిస్తాడు. ఇద్దరికీ శబ్దాలమీద సమానాధికారం వున్నది. ఆయన కవుల కవి. ఈయన ప్రజల కవి. ఇద్దరిలో ఎవరు గొప్ప?

కొందరికి కృష్ణశాస్త్రి పాట చక్రిపాట. కొందరికి శ్రీశ్రీ పాట చెరుపాట.

ఇద్దరిలో ఎవరో ఒకరు గొప్ప కావలసిన అవసరం ఉందా? అసలు యీ ప్రశ్నలకు సమాధానాలు ఉండవలసిన అవసరం ఉందా? ఇది మళ్ళీ యింకో ప్రశ్న. ఊహు. లాభం లేదు.

ఈ ప్రశ్నల మూలానే, కీ సొల్యూషన్ లేని క్రాస్‌వర్డ్ పజిల్‌లాగ తయారైంది లోకం. అయితే ఆల్ కరెక్టు. లేకపోతే గుడ్డు సున్నా.



# మేము ముగ్గురం

మేముంటేది ఒక మేడమీదగదిలో - ఆ మేడమీదకి ఎక్కకముందు దాకా మేము ఒక రకమైన మనుష్యులు - మేడ ఎక్కాక మరొకరకం మనుషులం.

మేడ ఎక్కకముందుదాకా ముగ్గురం చేతులూ భుజాలూ కలుపుకుని రోడ్డంతా తిరిగి - కాలేజీకి కలిసివెళ్ళి, కలిసివచ్చి, మేడమెట్లు ఎక్కేదాకా అన్నీ ఒక్క మనిషి చేసినట్టు చేస్తాం. ఆ మేడమెట్లు కొన్ని ఎక్కాక, మాలో విచిత్రమైన మార్పు వచ్చేస్తుంది. ముగ్గురం మూడురకాలై పోతాము. మూడురకాల ధృవాలు. ప్రకృతికి తెలిసిన ఉత్తరదక్షిణ ధృవాలలాగా - చస్తే ఒకదానితో మరొకదానికి పొత్తు అక్కరలేని ధృవాలు. నేను యీ విషయాన్ని అనేకరోజుల పరిశోధనలవల్ల ధృవపరిచేను.

ఇంతకూ మేడమీదికెక్కాక: మా శాస్త్రిపని తెలుగు వ్యాకరణంతో కుస్తీ పట్టడం; పద్యాలు చదవడం.

"శ్రీరస్తు భవదంఘ్రి
  చికురంబులకు మహా
భూర్యబ్దములు -
  సితాంభోజనయన......"

పద్యమంతా చదివేస్తాడు. ఆ తరవాత వొస్తుంది అనుమానం. 'మహాభూర్యబ్దములు' ఏ సమాసం? కర్మధారయమా? కాక, బహువ్రీహేమో. 'వాని కర్మ - కర్మధారయమో కాదో నీకెందుకురా' అంటాను నేను. నాకు పద్యమయితే అద్భుతంగా ఉంది. దానిలో సౌందర్యమంతా వదిలేసి ఏదో మాట ఏసమాసమో తన్నుకునేవాడి నేమనాలి?

ఇంక మాగిరిపని: నిశ్చింతగా యీ ప్రపంచంతో ఏమీ సంబంధంలేనివాడిమల్లే కూర్చుని సిగరెట్లు తగలెయ్యడం. వాడికీ పడకకుర్చీకి ఏదో సాన్నిహిత్యం ఉంది. వాడికి సిగరెట్టు ఖర్చేకాని అగ్గిపెట్టె ఖర్చులేదు; ఒక సిగరెట్టు అయిపోకముందే యింకోటి వెలిగిస్తాడు. ఏదేనా చదవాలనే తాపత్రయం కాని, పోనీ, వినాలనే ఉద్దేశ్యంకాని వాడికి ఏకోశానా లేదు. 'నీకోసం, నీ పరీక్షకోసం, మీ యింట్లో వాళ్ళు ఎంతో ఆశిస్తున్నారురా - నువ్వేదో పొడిచేస్తున్నావని అనుకుంటున్నారు, నువ్వు చదవాలిరా,' అంటాడు శాస్త్రి. యత్కించిత్ జ్ఞానములేదు - ఆ మూర్ఖుడికి. తిట్టి శపిస్తాడు శాస్త్రి - 'నువ్వు చచ్చినా పరీక్ష ప్యాసవవని. అది తనకు వరమనుకుంటాడు గిరి.

ఇక నా వ్యవహారం: యీ రెండింటికీ భిన్నం. మేడముందు బాల్కనీలో తిరుగుతూ ఎదురుగుండా మేడలోఉన్న అమ్మాయిని చూడడం నాపని. మేడ ఎక్కిన దగ్గిరనుంచి దిగేదాకా యిదే పని. ఆ అమ్మాయి మా క్లాసే. ఎప్పుడూ చదువుతూనే ఉంటుంది: బుర్ర కొంచం గట్టిదేమో -, ఒకపట్టాన లోపలికిపోదు చదువు.

ఏదో పద్యం చదువుతూంటే ఆ అమ్మాయికీ అనుమానం వొస్తుంది. మహాసాగరము ఏ సమాసం? వాళ్ళన్నయ్య వడుగుతుంది. చప్పున నాకూ సమాసాలమీద యిష్టం కలుగుతుంది. "శాస్త్రీ, మహాసాగరము ఏం సమాసంరా?" అని కొంచం గట్టిగా అడుగుతాను నేను వాడికి అదురు పుడుతుంది. "ఏమిట్రోయ్ నీకు తెలుగుమీద యీ అకారణ మమకారం" అంటాడు వాడు - అసలు మమకారం ఎక్కడో వాడికి తెలియదు.

"మా శాస్త్రి "శ్రీరస్తు భవదంఘ్రి చికురంబులకు..." అంటూ పద్యం పాడతాడు. మా గిరి రింగులు రింగులుగా సిగరెట్టుపొగ వొదులుతాడు. నేను ఆ పద్యాల్లో అర్థం ఆ అమ్మాయి పరంగానూ, ఆ పొగవొంపులన్నీ ఆ అమ్మాయి ముంగురుల నొక్కులతోనూ పోల్చుకుని ఊహించుకుంటూ బాల్కనీలో పచార్లు చేస్తాను.

ప్రపంచం ఏమన్నా కానీండి. యింకో కొన్ని వేల ఆంధ్రరాష్ట్రాలు రానీండి. మా కార్యక్రమం యిదే. వాడి వ్యాకరణం, పద్యాలూ, గిరిగాడిసిగరెట్లూ, నా ఊహలూ, పచార్లూ, సూర్యచంద్రాదులు గతులు తప్పినా, మా కార్యక్రమం తప్పదు. మళ్ళా మేడకిందికి దిగామో - మాపనులన్నీ ఒక్కటే - ముగ్గురమూ ఒక్క మనిషిలా ప్రవర్తిస్తాము. విచిత్రమే.

మాలో ఎవడిదగ్గిర డబ్బులున్నా చాలు. ఎవడిదగ్గిరా లేకపోవడం ఎప్పుడూ జరగలేదు. ఎంత డబ్బు నాన్న పంపుతున్నాడో అంచనా తెలియకుండా చేసింది ఎదురుగుండాఉన్న అమ్మాయి. అదొక ప్రవాహం: నాన్నదగ్గర్నించి నాదాకా. నేనేదో మహా చదివేస్తున్నాననో, రెండో సంవత్సరం కూడా అనో, మా నాన్న అడిగినంత డబ్బూ పంపేస్తున్నాడు, అప్పుడప్పుడు కేకలేసినా. అదీ, మావాళ్ళ డబ్బూ కలిసి మాకు హాయిగా సరిపోతోంది.

మాకు శాస్త్రానికైతే వేరె పక్కలూ, బెడ్డింగులూ, పెట్టెలూ ఉన్నాయి గాని, ఆచరణలో అవేవీ లేవు. రాత్రి చాలాసేపు పొద్దుపోయేదాకా వ్యాకరణంలో స్నేహితుడైన యింకొక వ్యక్తితో 'గజం పడియె' అనే రూపం ఎలా వచ్చిందో సాధిస్తూ కూర్చుంటాడు శాస్త్రి. ఇంకా చాలసేపటిదాకా గిరి సిగరెట్ల పొగను మేఘాల్లోకి పంపిస్తాడు. 'ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతఃక్వ మేఘః' అన్నారు పెద్దలు. ఇంకా కొంత సేపటిదాకా - అంటే ఆ అమ్మాయి చదువుముగిసేదాకా నేను డాబామీద పచార్లు చేస్తాను. ఎవరికి ఎప్పుడు ఎక్కడ నిద్దరొస్తే, అప్పుడు అక్కడ పడుకుంటాము. అదంతా ఒక విచిత్రమైన గది; విచిత్రమైన మనుషులూ; ఎవరికీ ఏపక్కలూ అక్కరలేదు; ఏవి చేతికందితే అవి వేసుకుని పడుకుంటారు; తెల్లారేక తీసి వాటిని చుట్టి పెట్టేవాడెవడూ ఉండడు. మళ్ళీ రాత్రవుతుందిగా! అప్పుడెల్లాగూ పడుకోవాలి. ఈలోపుగా ఎవడు మడతాడు పక్కల్ని... మాకు చాలా పనులున్నాయి!

*   *   *

ఇలా ఎన్నాళు గడిచిందో మాకు గుర్తులేదు. కాని కొంతకాలం గడిచిన మాట మాత్రం నిజం. ఇంతలోకి ఎక్కడినుంచి ఊడిపడ్డాడో మామయ్యవచ్చాడు. వచ్చినవాడు నాతోపాటు హోటలుతిండి తిన్నాడుగా... మాటాడక పడుకోరాదూ... ఏదో కోర్టుపనికోసం పగలల్లా బయటికిపోయి చీకటిపడ్డాక మేడమీదికి చేరుకునేవాడు. మామయ్య నాకు మామయ్యకాని, మిగతా వాళ్ళకి మామయ్యకాదుగా! శాస్త్రి పద్యాలు మానలేదు. గిరిగాడు పనేమిరా సిగరెట్లు మానలేదు. ఇంక నాపని బయటికి కనపడే వినపడే పనికాదుగా. ఏమీ ఎరగనట్టుగా బాల్కనీలో పచార్లు చేస్తూనే ఉన్నా - చేతిలో పుస్తకం మాత్రం పట్టుకుని.

మామయ్య వచ్చిన మొదటిరోజునే ప్రారంభించాడు. "ఒరే! మీ నాన్న నీకు నెలకి రెండువందల రూపాయిలు పంపిస్తున్నాడు తెలుసా? నువ్వు యింట్లో ఉంటే వ్యవసాయం పనిచూసేవాడివి.



"మామయ్య ప్రారంభించాడు నీకు వేరేపక్క, బెడ్డింగూ, బట్టలూ ఉండగా వాళ్లవీ వీళ్లవీ వాడతవెందుకురా? వాళ్లెంత స్నేహితులైతేమాత్రం కాస్త యింగితజ్ఞాన ముండక్కర్లా..."

నువ్వు చదువు వెలిగించబట్టి అక్కడ పాలేరుకి జీతం ఖర్చు అందుచేత నీకు, నీ చదువుకి నెలకి రెండువందల ఏభైరూపాయిలు ఖర్చు. ఆ డబ్బుమీద లాభం లేకపోయినా, అసలు కిట్టుబాటు కావాలా? చదవరా—"

మామయ్య ఎల్లాగో అనుకున్నాడు శాస్త్రి, గిరీ నా డబ్బు తినేస్తున్నారని. యింక సతాయించడం ప్రారంభించాడు. వాళ్ళతో నే కబుర్లు చెపుతూ.

"మాదెండి గిరీ గారూ. స్నేహితులుండాలే అనుకోండి, మీలాటి మంచివాళ్లు. కాని అడ్డమైనవాళ్లూ మావాడికి స్నేహితులే. వారికోసం డబ్బు తగలెయ్యడమే చివరికి ఒకడూ అక్కరకురాడు. వీడికేం, వీడు సంపాదిస్తున్నాడు కనకనా. వీ డేదో బాగుపడి వృద్ధిలోకి వస్తాడని వాడు యిపవుతున్నాడు. అసలేమన్నా చదువుతున్నాడంటారా?"

సిగరెట్టుపొగ ఆకాశంలోకి వొదిలి .. యీ పొగలాగా జీవితాలు కూడా నిత్య చంచలాలనీ, క్షణభంగురాలనీ ఏకో వేదాంతిలా చూస్తాడు గిరి. వాడికి సమాధానం చెప్పడానికికూడా నోరుండదు, మేనమామదికొస్తే

శాస్త్రి కొంచం నయం మామయ్యకి నచ్చే పద్ధతిలో మాట్లాడతాడు. మా గది వ్యవహారం చూస్తే మా మామయ్యకి ఏమీ నచ్చలేదు ఈ గిరిగాడంటే ఆయనకి మరీ అరికాలిమంట నెత్తికొస్తోంది. వాడు తగలేసే ప్రతి సిగరెట్టులోనూ నా రూపాయినోట్లు (అంటే మానాన్నవి) ఆయనకు కనిపించాయి పైగా యీ గిరి అసలు మాట్లాడడు. ఈ ప్రపంచంలో ఎవరినీ లెక్కచెయ్యడు. నా వస్తువులు, అవి మామయ్యకి తెలిసిన రేజరు, బట్టలు, మొదలైనవన్నీ అలవాటు చొప్పున తనవిలాగా వాడుకుంటున్నాడు. మళ్ళా తీసినవాటిని జాగ్రత్తగానైనా పెట్టడు. మామయ్యంటే ఉండే గౌరవంకొద్దీ నేను కొంచం మారేనుగాని, వాడేమీ మారలేదు. పైగా యింకా నిర్లక్ష్యంగా తయారయ్యాడు.

మామయ్యకి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. 'నాది', 'నేను' అనుకునే మన తత్వంతో, ప్రతీదీ రూపాయి, అణా, పైసల్లో కొలిచే మామయ్యకి మా సంబంధాలు ఏమీ అర్థంకాలేదు. ఒకరోజున ట్రంకుపెట్టె తాళం లేకపోవడం చూశాడు. అందులో డబ్బుంది. దాంట్లోంచి నాకు-

కావలసిన డబ్బు తీసుకుంటూండగా చూశాడు. తరవాత గిరిగాడుకూడా అందులోంచే డబ్బు తీసుకోవడం చూశాడు. ఇలా అందరి డబ్బూ ఒకదగ్గరే ఉండి, లెక్కా, పత్రం లేకుండా ఎవరిక్కావలసింది వాళ్లు తీసుకోవడం, మామయ్య సహించలేకపోయాడు.

వెంటనే ఆయన ఒక నిర్ణయానికొచ్చేశాడు. వీళ్ళంతా నా డబ్బే తింటున్నారు; అని. కాని నిజానికి అదేమీ కాదు, నేనా విషయం ఆయనతో చెప్పాకూడా. నేనెప్పుడూ సరిగా లెక్క చెయ్యకపోయినా, ఆ వేళ వేశాను. నాకు నాన్న సుమారు 125 రూపాయలు పంపుతాడు. గిరిగాడి యింటి నించి దరూరమి 150 దాకా వస్తాంటాయి. యింక ఎటొచ్చీ స్థిరమైన ఆదాయం లేనివాడు శాస్త్రి ఒక్కడే. కాని, మా యిద్దరిదీ, వాడిదీ కలిసి మొత్తం మాకు సరిపోతోంటేగా!

మామయ్య వొచ్చాక, యింతవరకూ ఉన్న యీ పరిస్థితి మారిపోతుందేమోనని భయం వేసింది నాకు. ఎందుకంటే, మేము లేకపోతే, శాస్త్రిగాడికేం పరవాలేదు. హాయిగా యింటికి చక్కా పోతాడు. కాని నాకే. వాడు లేకపోతే నేను బతకలేను. గిరిగాడు అంతకన్న ఉండలేడు. మా ముగ్గురికీ ఉన్న సంబంధమేమిటో నాకు అర్థం కాదు. అప్పటి మాటే కాదు-ఇన్నేళ్ళయిందా, మూసురకాల ధృవాల లాంటి మేం ముగ్గురం ఒకళ్ళు లేకపోతే యింకోళ్లు ఉండలేం.

శాస్త్రిగాడు చాలా సున్నితమయిన మనిషి. మామయ్య అన్న మాటలన్నీ శాస్త్రికే తగిలేవి. గిరిగాడు కేవలం గిరి; మహాపర్వతం. గంభీరంగా అలా కూర్చుని సిగరెట్లు కాలుస్తూనే ఉన్నాడు. గోదావరి వచ్చిన నాటిరాత్రి రాజమండ్రి తుమ్మలావలో ఉన్నా అల్లాగే సిగరెట్లు కాలుస్తాండేవాడని నా నమ్మకం.

మామయ్య ప్రారంభించాడు. "నీకు వేరే పక్కా, బెడ్డింగూ, బట్టలూ ఉండగా, వాళ్ళవీ, వీళ్ళవీ వాడతా వెందుకురా. వాళ్ళంత స్నేహితులైతే మాత్రం - కాస్త యింగితజ్ఞాన ముండక్కర్లా...

"అవునురా - ఒరే - నీ పెట్టికి తాళం అదీ ఉండక్కర్లా. నీ వస్తువులూ, అవీ జాగ్రత్తగా, భద్రంగా, పెట్టిలో పెట్టి, తాళం వేసుకోవాలిగాని, నీ యిష్టం వచ్చినట్టు పారెయ్యడమేనా? నీ స్నేహితులు మంచివాళ్లే ననుకో... కాని, యీ రూములోకి ఎంతోమంది వస్తారు, వెళ్తారు.

"ఏమండోయ్ - గిరిగారూ - శాస్త్రిగారూ - మీ రయినా సరే. జాగ్రత్త మంచిదికదండీ, మీరు పెట్టెలకి జాగ్రత్తగా తాళాలు వేసుకుని, తాళంచెవులు మీదగ్గర పెట్టుకోండి. అదిభద్రం గాని,...యిదేమిటే ఏవస్తువు పోయినా!"

నాకు యీమాట కొంచెం చురుకుగా తగిలింది. ఇన్నాళ్ళబట్టి ఇక్కడున్నాము గాని...నాది, నా పెట్టె, అనే ఆలోచనకి తావే లేకపోగా, పెట్టెలకి తాళం వేసుకోవాలనే ఊహ కూడా రాలేదు. మా గిరిని గాని, శాస్త్రిని గాని అనుమానించడమంటే నన్ను నేను అనుమానించుకోడంలాంటిది. మామయ్యకేం తెలుసు. ఇంట్లో అత్తయ్య కూడా అనుమానపడి పెట్టెలు తాళం వేసుకునే మనిషి. నాకు అరికాలులో మంట పుట్టింది. ఈయనలా ప్రపంచమంతా అపనమ్మకాల పుట్ట అని యీయన ఉద్దేశం. ఈయన బతికుండగా యింకోళ్ళని నమ్మడు

...అయినా మామయ్య చెప్పిన మాటలలో కొంత అనుభవం, నిజం ఉన్నాయేమో! ఇంకా చాలామంది వస్తాంటారన్నాడు. నిజమే. అనేక రకాలవాళ్లు వస్తూండమ్మా. మామయ్య చెప్పిన మాట నిజమే నేమో.

గిరి, మామయ్య మాటలకి చలించలేదు. "నా పెట్టికి తాళం లే"దన్నాడు, ముభావంగా.

శాస్త్రి కొంచం సూరేకారపు జాతి. "మీ పెట్టికి భద్రంగా తాళం వేసుకుంటున్నారుగా! చాలులెండి" అన్నాడు.

మామయ్య మొహం కందగడ్డయింది. "మీ శ్రేయస్సుకోసం చెపుతున్నాను - యిందులో నాకు ఒరిగిందేమీ లే"దన్నాడు. నాకు శాస్త్రి మాటలు బాధ కలిగించాయి. మామయ్య మన మంచికోసమే చెప్పాడు గాని, తనకేం నష్టం, మేం అనుసరించకపోతే.

"మర్రకుంకా, నీ కింకా తెలియదు. నల్లనివన్నీ నీళ్ళనీ, తెల్లనివన్నీ పాలనీ నీ నమ్మకం"— అన్నాడు మామయ్య నాతో వికొంతంగా.

నేనేమీ మారలేదు. మిగతావాళ్లూ మారలేదు. మామయ్యా మారలేదు.

మామయ్య యీసారి నాకొక్కడికీ వేరే కొన్ని సంగతులు చెప్పడం ప్రారంభించాడు. అందరం ఉన్నప్పుడు సరదాగా మాతో కాలక్షేపం చేస్తున్నాడు. కనపడ్డ ప్రతి వస్తువూతీసి దాని ఖరీదు అడగడంమామూలు ఆయనకి. గిరినెలాగూ అడగడు. అడిగినా వాడు చెప్పడు. శాస్త్రి నడిగితే, చెప్పినప్పుడు చెప్తాడు, లేనప్పుడు లేదు. ఇంక నన్ను గుచుతాడు. ఏదో ధర చెప్తాను. అంత కన్నా తక్కువకి దొరకలేదు దొరుకుతున్నాయంటాడు. ఇది ఆయనకి మామూలు. ఒకసారి ఫోటోఫ్రేమ్ చూశాడు. రేజరు సెట్టు చూశాడు. పెన్ను చూశాడు. వీటిధర లడిగాడు. ఫోటోఫ్రేమ్ బాగుందని అంగీకరించాడు. దానిధర రూపాయిన్నర అయితే కొనవచ్చన్నాడు. నేను అయిదు రూపాయిలకి కొన్నానన్నాను. మిగతావీ యింతే.

మాటల్లో జ్ఞాపకంవచ్చి, "ఒరే, నీకు మీ నాన్న వాచీ కొన్నాడట, ఏదిరా" అన్నాడు.

రిపేరరు దగ్గిరుంది, తేవాలన్నాను.

"అది చాలా ఖరీదయిన వాచీరా, ఎవడో రిపేరరు కిచ్చావంటా వేమిటి? దగ్గిరుండి బాగుచేయించుకు రాక? యీవాచీ రిపేరర్లని నమ్మకూడదురా, ఖరీదయిన సామాన్లు తీసేసి ఏవోచెత్తవి వేస్తారు.."అని చాలాకోపంగా అన్నాడు.

నాకు నవ్వువచ్చింది. ఆశ్చర్యమూ కలిగింది. అసలు కొన్నిరకాల మోసాలు మనం ఊహించలేం. నా వాచీ యిచ్చేటప్పుడు నాకు యీలాంటి అనుమానమే స్ఫురించలేదు.

"వాడిదగ్గిర కూచుంటే మాత్రం తియ్యదల్చుకుంటే సామాన్లు తియ్యలేడా-నమ్మకం ఉండాలి గాని. వాచీ రిపేరర్ నా స్నేహితుడే పరవాలేదులే" అన్నాను...సావకాశంగా.

ఏమయినాసరే - ఆ సాయంత్రం వాచీ తెచ్చేదాకా నిద్రపోలేదు మామయ్య. సరే తెచ్చాను. దాన్ని సరదాకి తనచేతికి

పెట్టుకోడానికి ప్రయత్నం చేశాడు. ఆ సైకిల్ పెట్టడం కుదిరిందికాదు. లాగాడు - పీకాడు - బిగించాడు - వగులు చేశాడు - చివరికి సైకిల్ కాస్తా విరిగి ఊరుకుంది. "వధవ సైకిల్ ఎంతకి కొన్నావురా" అన్నాడు. "నాలుగురూపాయి"లన్నాను. "దండుగ-యిట్టే విరిగిపోయింది"అన్నాడు.

"విరక్కొడితే, ఎంత ఖరీదయినదయినా విరిగిపోతుంది," అనేసి నాలుక్కొరుచుకున్నాను.

"ఇంకో సైకిల్ కొనరా, ఎందుకు నాలుగు రూపాయిలు దండగ, కొంచం చవకది కొను."

నేనొక్కడినీ బజారుకు ఎప్పుడూ పోను. గిరిని రమ్మంటే రానన్నాడు. శాస్త్రిగాడికీ వాడి స్నేహితుడికీ 'అపార పారావారము' ఏ సమాసమో తేలలేదు. మేడ మీద ఆ అమ్మాయి ఉండగా నేను కిందకి దిగదల్చుకోలేదు. దాంతో ఆ వాచీ మళ్లా పెట్లో పడేశాను.

ఆవేళ మామయ్యకి కోర్టులో వాయిదా. కిందటిసారి వాయిదా కొంచం దగ్గర పడేసరికి మళ్ళీ వెళ్ళివచ్చేదేమిటిలే అని ఉండిపోయాడుట. పొద్దున్న వెళ్ళినవాడు మధ్యాహ్నం మూడుగంటలకి తిరిగొచ్చాడు అప్పటికి మేమూ కాలేజీనుంచి వచ్చాము. కాఫీ తాగాక, మామయ్య నన్ను పిల్చి, "ఒరే! నాకో పాతిక రూపాయలు అర్జంటుగా కావాలిరా. ప్లీడరు అర్జంటుగా కావాలన్నాడు. మళ్ళా యింటికెళ్ళిన వెంటనే పంపించేస్తాను" అన్నాడు.

గబగబా వెళ్ళి పెట్టె తెరిచి చూశాను. అందులో మహా ఉంటే పది రూపాయిల లోపు ఉంటాయేమో.

"మామయ్యా, రూములో డబ్బంతా అయిపోయింది. మహా ఉంటే పది రూపాయిలుంటుందేమో. ఇంకా ఎవరకీ మని యార్డరు రాలేదు" అన్నాను.

మామయ్య తల పంకించి, "నీ దగ్గిర డబ్బంతా అప్పుడే అయిపోయిందట్రా! నాన్న యీ నెల 150 పంపేడన్నావ్. మరీ యింత ఖర్చేమిట్రా" అన్నాడు.

నాకు మండుకొచ్చింది. యిందులో దాదాపు 50 రూపాయిలు నీకోసమే అయిపోయింది. పాపం గిరిగాడు, శాస్త్రి యీ నెల ఖర్చు ఆట్టే చెయ్యకపోబట్టి సరిపోయిందనుకుంటాను - అని అనేద్దామనుకున్నాను గాని, ఊరుకున్నాను.

"ఆ గిరిగాడిదగ్గిర లేదూ..." అన్నాడు మళ్ళీ.

"లేదు మామయ్యా, ఉంటే అంతా పెట్లోనే ఉంటుందిగా."

"పోరా! నీదంతా మరీ యిది. వాడు చేస్తున్న పనులన్నీ నమ్ముతున్నావా చెప్పు. ప్రపంచమంతా నీలాగా మంచి వాళ్ళనుకున్నావా? వాళ్ళ నాన్న పంపిందంతా గిరిగాడూ శాస్త్రీ, నీలాగా నిజాయితీగా పెట్లో వేస్తున్నారంటావా? నువ్వు వట్టి వెర్రిదద్దమ్మవి కాబట్టి, వాళ్ళ పొట్టూ, నీ పప్పూ కలిపి ఊదుకు తింటున్నారు."

ఆమర్నాడే గిరికి 150 రూపాయిలు మని యార్డరు వచ్చింది. మేమందరం చూస్తూండగానే పెట్లో పడేశాడు వాడు. గిరిగాడి నాన్న వాడికన్నా గంభీరుడు. డబ్బు పంపించేనన్న మాటే కాని - మరొక అక్షరమయినా ఉత్తరంలో లేదు.

ఆవేళ మామయ్య సాయంత్రం ఎక్కడికో వెళ్ళాడు. రాత్రి కొంచంఆలస్యంగా వచ్చాడు. అప్పటికి మేమూ భోజనానికి వెళ్ళలేదు. అప్పుడు బయలుదేరి తిండి తిని పడుకున్నాము. ఆవేళ బాగా చలేస్తోంది. శుభ్రంగా ముసుగులుతన్ని పడుకున్నాము.

పడుకోబోతూ, మామయ్య తెల్లవారు ఝామున ఏదో ఊరు వెళ్ళాలన్నాడు. "అలారమ్ పెట్టాలా?" అంటే ఒద్దన్నాడు.

ఆయన నాలుగు గంటలకే లేచాడు. పెట్టీ, బెడ్డింగూ సర్దుకున్నాడు. రైలు టైమవుతూండగా "నేను వెళ్తున్నారా" అని నన్ను లేపాడు.

చలికాలపు తెల్లవారుఝాము నిద్ర— మామయ్య పిలుపుకి నాకన్నా ముందు శాస్త్రి లేచాడు. శాలువా ముసుగుపెట్టి "దళివేళల్ చెలి లేని జీవనము వృధా, చంచద్వయశ్శాలికిన్—" అంటూ పద్యం లంకించుకున్నాడు. మామయ్యతో- "సరే, మంచిది వెళ్ళండి," అన్నానేగాని బాగుండదని లేచాను. గిరి ఏమయినా సరే లేవడు.

నేనూ శాస్త్రీ, మామయ్యా కిందకి దిగాము. ఆ చలిలో, రాత్రి ఏ కూలాడు దొరుకుతాడు? ఇంతట్లో రైలు కూసింది. నేను సావకాశంగా - "మామయ్యా, నీకీ రైలు అందదు, తెల్లవారేక వెడుదువు గానిలే" అన్నాను.

"అన్నట్టు మరిచిపోయాను - యీవేళ నీ పుట్టిన రోజురా - మీనాన్న రాశాడు కూడాను" అన్నాడు శాస్త్రి.

"అవును, మరిచిపోయాను మామయ్యా, ఉండిపో, రేపెళ్ళచ్చు." అన్నాను నేను.

"కాదురా. నేను వెళ్ళకపోతే కొంప మునుగుతుంది. ఎల్లుండి కోర్టులో సాక్ష్యానికి ఒక మనిషిని పంపాలి. ఆ మనిషి నేను వెళ్ళబోయే ఊళ్ళో ఉన్నాడు. మళ్ళా వెంటనే నేను మా ఊరుకూడా వెళ్ళాలి. చాలా అర్జంటు. పోనీలే, యీ రైలు పోతే పోయిరి, బస్సుకు పోతాను, ఓ పావలా ఎక్కువయితే అయింది."

మామయ్య తొందరపడుతున్నాడు. కూలివాడెవడూ దొరకడు. ఆ పెట్టె మేం ముగ్గురం కలిసికూడా మొయ్యలేం. ఇంతట్లో కారు హారన్ వినపడింది.

"టైమయిపోతోంది పరిగెట్టితే బస్సందుతుంది" అన్నాడు శాస్త్రి:

"సరే - యింకేం చేస్తావ్ మామయ్యా, ఆ వూళ్లో పనిచూసుకుని మళ్ళా మధ్యాహ్నం బస్సులో యిక్కడికొచ్చెయ్. వెంటనే బయలుదేరి యింటికెళ్దువుగాని. లేకపోతే యీ సామాను యిప్పుడెలా మొయ్యగలం?"

"పెట్టె వొదిలేస్తే ఎల్లారా?..." మామయ్యకేమీ తోచటంలేదు. మేమెవ్వరమూ మాట్లాడలేదు. బస్సు హారన్ మళ్ళా వినిపించింది. చివరికి తెగించి, "పెట్టె జాగ్రత్తరోయ్" అరిచి పరుగు లంకించుకున్నాడు మామయ్య.

"భద్రంగా తాళంవేసి. తాళంచెవి మీ దగ్గరుంచుకున్నారుగా" అని అరిచాడు శాస్త్రి. నాకు నవ్వాగిందికాదు.

మామయ్య వెళ్ళాడన్నమాటేకాని, ఆయన మనస్సు యీ పెట్టె, బెడ్డింగుమీదే ఉండి ఉంటుంది. శరీరం మాత్రమే బస్సెక్కి ఉంటుంది.

మేడెక్కి మళ్లీ పడుకోవాలనుకున్నాం గాని, ఆవేళ నాపుట్టినరోజు. మొహం కడుక్కుని స్నానం చెయ్యమన్నాడు శాస్త్రి. సరే, యింత చలిలో అలాగే చేసి, కొత్త బట్టలు తొడుక్కుని, గిరిగాణ్ణి లేపాము. వాడు సావకాశంగా లేచాడు. బయటికి బయలుదేరాము. గిరి నాకోసం ఏవేవో వస్తువులుకొని పుట్టినరోజు పండుగ బహుమానంగా యిచ్చాడు. శాస్త్రి ఒక చక్కని తెలుగు పుస్తకం కొని బహుమానంగా యిచ్చాడు. అంతా కలిసి కాఫీ తాగి రూముకి వచ్చేసరికి సుమారు పదిగంటలయింది. ఇంక మేడమెట్లెక్కబోతూండగా ఆ అమ్మాయి వాళ్ళయింటి గుమ్మం దగ్గిర నిలబడి మమ్మల్ని పిలిచింది. ఏమిటో అనుకుని వెళ్లాము. ఆవేళ నా పుట్టినరోజు కాబట్టి తన శుభాకాంక్షలు అందజేసింది! రిబ్బను ముడివేసిన పార్సెలు ఒకటి అందజేసింది! నాకేదో విపరీతమయిన ఆశ్చర్యం వేసింది. ఒక్కక్షణంలో ఏవేవో స్ఫురించాయి. ఏదో ఉన్మత్త ఆనందంతో, ఉత్కంఠతో, 'థాంక్స్' అనేమాట అనేసరికి చాలా కష్టమయిపోయింది.

గబగబా మేడమెట్లెక్కి పోయాను బాణంలాగా. నా సంతోషానికి అంతులేదు; అవధి లేదు - నా పుట్టినరోజు యీవేళ అని

ఆ అమ్మాయి కెల్లా తెలుసు? ఇదంతా శాస్త్రిపని. నాన్న రాసిన ఉత్తరం మైక్‌లో చదివినంత గట్టిగా చదువుతాడు. మా ప్రతి కదలికా ఆ అమ్మాయికూడా గమనిస్తున్నదన్నమాట! నే నాక్షణంలో ఒక దివ్య స్వర్గంలో ఉన్నాను. ఆ పార్సెల్ నా చేతిలోంచి లాక్కొని రిబ్బన్ విప్పాడు శాస్త్రి. ఆశ్చర్యం! అందులో చక్కని వాచిచైన్ ఉంది! నా వాచీచైన్ విరిగి పోయిందని యీ అమ్మాయికి తెలిసే యీపని చేసుంటుంది. ఆ వాచీ పెట్టుకోవాలి యీ వేళ!

గబగబా పెట్టె తీశాను. వాచీ కనబడ లేదు! అరె, ఏమయింది? పైనే పెట్టానే! లోపలకూడా వెతికాను. లేదు. పెట్టెలో డబ్బులతో సహా అన్నీ బయట ఒలకబోసి చూశాను. కనపడలేదు. ఏమయింది చెప్మా! ఏ శాస్త్రి గాడో, గిరి గాడో ఏడిపించ డానికి తీశారా? శాస్త్రినడిగాను. వాడు అదిరిపడ్డాడు. నాకన్నా ఎక్కువ కంగారుగా వెతకటం ప్రారంభించాడు. వీడు వేళాకోళానికి తీస్తే మొహం యింకోలా ఉంటుంది. సీరియస్‌గా వెతుకుతున్నాడు. వీడికేమీ తెలియదు వాచీసంగతి. గిరి నడిగాను. 'నాకేం తెలుసోయ్ నీ వాచీసంగతి' అన్నాడు నిశ్చలంగా.

వాచీ ఏమయిఉంటుంది? ఏదో జరిగి ఉండాలి. మారూములో ఎప్పుడూ యిలాటివి జరగలేదు. ఎవరిని అనుమానించడమూ మాకు చేతకాదు.

"ఏమయిఉంటుందిరా? వాచీ" శాస్త్రి నడిగాను. వాడిమొహం అప్పుడే కందగడ్డ అయిపోయింది. వాడిమీద అనుమానపడడం తేలిక అని వాడికి తెలుసు. అందుకనే నేను మాటలు చాలా జాగ్రత్తగా వాడుతున్నాను. వాడిని బాధపెట్టడం నాకు యిష్టంలేదు. గిరి అసలు యీ రంగంలోకే రాలేదు కొంతసేపు. కాని రానురాను వాడికీ భయంవేసింది, నిజంగా పోయిందేమోనని. వాడుకూడా రూమంతా వెతికేశాడు. ఎక్కడా దొరకలేదు.

దేవతలకి ముందు హాలాహలందొరికి, తరవాత అమృతం దొరికింది. నాకు ముందు అమృతందొరికి తరవాత అందులో హాలాహలంపడింది.

నిజానికి నాకు వాచీ పెట్టుకోలేకపోయాననే బాధ, వాచీపోయిందనే వ్యధకన్నా, యీ స్వర్గంలో మామధ్య యీ సంఘటన ఎలాటి అవాంఛనీయ పరిస్థితులు తెచ్చిపెడుతుందో అనే భయం ఎక్కువైంది. శాస్త్రి, గిరి, అసలు మాట్లాడ్డమే లేదు. శాస్త్రి మొహం కందగడ్డయిపోయింది. గిరి మాత్రం హిమాలయోత్తుంగ శృంగంలా తల పెట్టి, సిగరెట్లు కాలుస్తూనే ఉన్నాడు.

ఇలాంటి సమయంలో వచ్చేశాడు మామయ్య. ఆయన్ని చూడగానే నా కెందుకో ఆ పాదమస్తకం నరాలు కదిలి పోయాయి ఒక్కసారి. ఆయనకి కావలసినట్టు తయారయింది స్థితి...

రావడం రావడం టేబులుమీద పెట్టి ఉన్న చైన్ చూసి...కొన్నావేమిట్రా అంటాడేమో అని భయపడ్డాను. కాని చూసికూడా ఆ మాట అనలేదు. శాస్త్రిమాత్రం చెప్పేశాడు. 'మీవాడి వాచి కనిపించటం లేద'ని. నాకు గుండె కొట్టుకోడం మానేసినట్టయింది. అక్కడ నిలబడలేకపోయాను. ఎక్కడికేనా వెళ్ళిపోవాలి. మామయ్య అనబోయే మాటలు మా ముగ్గుర్నీ శాశ్వతంగా దూరం చేసెయ్యగలంత వాడిగా ఉంటాయి; నాకు తెలుసు. ఈయన్ని తెల్లవారుఝామున సామానుతో సహా పంపేసిఉన్నా బాగుణ్ను.

మామయ్య కూడా గాభరాగా వెతికాడు. ఎన్నో ప్రశ్నలు వేశాడు. మామయ్య యీ అవకాశాన్ని ఎందుకో అంత మరీ తీవ్రంగా ఉపయోగించుకోలేదు. కాని అప్పటికీ ఆయన అన్నమాటలు సామాన్యమయినవి కావు. "స్నేహితులని నమ్ముకున్న వాళ్ళంతా యింతే! పైకిమాత్రం అందరూ పెద్దమనుషులే - సమయం దొరికే దాకా. చెపితే ఒక్కరు విన్నారూ - అనుభవించు. యీ సంగతి మీ నాన్నకి తెలిస్తే..." అదృష్టవశాత్తూ మామయ్యకి బండి టైమ్ అయింది. బండి 12 గంటలకి. గదిలో ఎవరూ భోజనాలకి బయలుదేరేట్టు లేరు. ఏదో మనిషి చచ్చిపోతే, పీనుగపోయిన తరవాత యిల్లులా ఉంది మా రూము. మామయ్య చేతికి ఒక హోటలు టికెట్టు చించియిచ్చి "భోజనం చేసి రండి" అన్నాను నీరసంగా. మామయ్య నన్నూ రమ్మన్నాడు. ఎందుకూ-యీయన గారి ధర్మపన్నాలు వినడానికేగా - "నేను రాను, మీరు వెళ్ళిరండ"న్నాను "ఈ టికెట్టుయిస్తే భోజనం పెడతాడుగా" అన్నాడు. "ఓ" - అన్నాను మామయ్య బయలుదేరాడు ధైర్యంగా.

ఇలా, యింకో కొన్ని గంటలు గడిస్తే ఏదో ప్రళయం వచ్చేస్తుంది. ఏమిటీ శ్మశాన శాంతి? నేను భరించలేకపోయాను మామయ్య మాటలు యింకా చెవుల్లో మోగుతున్నాయి. ఒకరు యింకొకరి మొగంకేసి చూడ్డం కూడా సాధ్యం కావడంలేదు - నాకు వీళ్ళమీద ఏ అనుమానమూ లేదని ఎల్లా చెప్పడం? మామయ్య మాటలు వాళ్ళ మీద చాలా దారుణంగా పనిచేశాయి. ప్రపంచం పాపిష్ఠిదా? - డబ్బు పాపిష్ఠిదా?

అనుమానం అన్ని రకాలుగానూ పోతోంది...వాచీ, ఏమయిఉంటుంది? యీమధ్య రూములోకి ఎవరెవరు వచ్చారు? మామయ్య అన్నమాటలన్నీ జ్ఞాపకానికి వస్తున్నాయి, వెనక నాలుగురోజుల క్రితం ఆ వాచీ తెచ్చాను. ఆ తరవాత ఎవరూ వచ్చినట్టులేదే! మేము ముగ్గురం-మామయ్య, అంతే. శాస్త్రి వ్యాకరణం స్నేహితుడైనా రాలేదు. మామయ్య...అవును, మామయ్య ...ఛా! ఏమిటీ అనుమానం? సాక్షాత్తూ మామయ్య, చిన్నప్పటినుంచీ తనకి జాగ్రత్త నేర్పుతున్న మామయ్య... డబ్బు ఎంత పాపిష్టిది? అందరినిగురించీ అనుమానం కలగజేస్తుంది!

ఏమో! ఆ వేళ అసలు చైన్ విరిగిపోయాక మా పెట్లో పడేశానా? ఆయనకిగాని యిచ్చేనా? ఆయనకే యిచ్చానేమో ఒక వేళ! అదే నిజమయితే అలవాటుచొప్పున తన పెట్లో వేసుకున్నాడేమో, మరచిపోయి. ఆయన జాగ్రత్తమనిషి.

నా తొందర మామయ్య భోజనంచేసి వచ్చేదాకా ఆగనిచ్చిందికాదు. పెట్టె నేను తీస్తే ఏమనుకుంటాడేం? మా తాళంచెవితో ఆయన పెట్టె తాళం వచ్చేసింది. పెట్టె నాలుగుపక్కలా వెతికాను - లేదు. బట్టలు కొన్ని బయటికితీసి చూశాను - కనపడలేదు. 'నా పెట్టెలోనే పెట్టిఉంటాను -' అనుకుంటూ యథాలాపంగా ఏదోసంచీ తీశాను. అందులో గబుక్కున కంటపడింది. కౌగితం చుట్టినవాచీ! నా కేమేమి అనిపించినవో, ఒక్క క్షణకాలంలో ఎన్ని సంగతులు స్ఫురించినవో చెప్పలేను. ఎందుకో గబగబా పెట్టెలో బట్టలు కుక్కేసి తలుపేసి తాళం నొక్కేశాను. "శాస్త్రి - వాచీ దొరికిందిరా" అని ఒక్క గావుకేక పెట్టాను.

వాడేమీ ఆశ్చర్యపడకుండా - "ఎక్కడ దొరికిందిరా" అన్నాడు బాల్కనీలోంచి లోనికివస్తూ. శాస్త్రి ఆశ్చర్యపడకపోవడం చూసి నా కాశ్చర్యం కలిగింది.

"అచ్చే - పెట్లోనే ఉందిరా...మూల. ఇందాకా మనం సరిగ్గా వెతకలేదు."

"నువ్వూ, నేనూ సరే...అలాగేననుకో.

(52-వ పేజీ చూడండి)

నాటిక:

# అసమర్థులు

## అంగర సూర్యారావు

1 దృశ్యం.

(ఒక గది కుడివైపు ఒక టేబిలూ రెండు కుర్చీలు - నల్లగా - చాలా పురాతనమైన వాటిలా వుంటాయి. టేబిలుమీద కలం, సిరాబుడ్డి, కొన్ని ఫైళ్లు చిందర వందరగా పడివుంటాయి. సినిమాతారల బొమ్మలు గోడకు అంటించి వున్నాయి. గదినిండా కత్తిరించిన కాగితం ముక్కలు పడివుంటాయి. చిట్టి గది తుడుస్తూ వుంటుంది. ఆమె వయస్సు 16 సంవత్సరాలు. తెల్లగా నాజూకుగా వుంటుంది. ఎడమవైపునుంచి కృష్ణ వస్తాడు. అతని వయసు 20 సంవత్సరాలు. చామనచాయగా పొడుగ్గా వుంటాడు. జుత్తు ముఖంమీద పడుతూ వుంటుంది. ముఖంలో ఎప్పుడూ చిరునవ్వు కనిపిస్తూ వుంటుంది. చొక్కా భుజంమీద కొంత చిరిగింది. ఫుల్ పాంటు బూటుదగ్గర బాగా చిరిగివుంది. చిట్టి అతన్ని చూడగానే తుడవడం మాని నిలబడుతుంది.)

చిట్టి: గదినిండా కాగితాలు కత్తిరించి పోస్తావెందుకు?

కృష్ణ: (నిర్లక్ష్యంగా) అదంతా కళారాధన.

చిట్టి: నీ కంత సినిమాలమీద అభిమానం వుంటే ఎక్కడకైనా వెళ్ళి ప్రయత్నించ కూడదూ?

కృష్ణ: ప్రయత్నించవలసిన ఖర్మ నాకు లేదు. నన్ను ఆంధ్రదేశం యిప్పటికి కాకపోతే మరోనాటికైనా గుర్తించకపోదు. (క్షణం ఆగి) చూడు చిట్టీ! నేను అమోఘంగా పాడగలను. అద్భుతంగా నటించగలను. ఆకర్షణీయంగా కనిపించగలను యిన్ని విశేషాలూ కల నేను, పేరు ప్రఖ్యాతులు లేక యిలా మారుమూల వుండడం ఆంధ్రదేశానికి [illegible]?

చిట్టి: [illegible] ఫీలవుతున్నా నువ్వు యీ పిచ్చి వేషాలతో యింట్లో వుండడం మాత్రం శ్రేయస్కరం కాదు. యిలా మరి కొంత కాలం గడిస్తే - ఎప్పుడో ఒకనాడు అమ్మ (చీపురు చూపిస్తూ) తిరగెయ్యక మానదు. (క్షణం ఆగి) యిలా వృధాగా తిరిగే కంటే ఏదైనా వుద్యోగం సంపాదించకూడదూ! నాన్నగారు చూడు! మనకోసం ఎంత శ్రమ పడుతున్నారో!

కృష్ణ: చిట్టీ! నువ్వు చిన్నదానవ్! పరి[illegible]గా అర్థం చేసుకోలేవు. నేను ప్రసిద్ధనటుణ్ణి అయినవెంటనే మన దరిద్రం తీరిపోదంటావా?

చిట్టి: గాలిమేడలతో కాలాన్ని వ్యర్థం చేసేకంటే చేతికందిన ఏ చిన్న ఉద్యోగమో చేసుకుంటే మన కష్టాలు కొంత కాకపోతే కొంతైనా తగ్గవా?

కృష్ణ: నిరుత్సాహపడకు చిట్టీ! సంకుచితమైన దరిద్రంతో కాలాన్ని కొలవడం నాకు యిష్టంలేదు. కళాదృష్టితో కాలాన్ని కొలుస్తాను. "మృచ్ఛకటికం" "అభిజ్ఞాన శాకుంతలం" వంటి అమోఘమైన నాటకాలు జన్మించిన నా దేశంలో నటులకు ఉత్తమస్థానం లేదా?

చిట్టి: నీ వెర్రి నీ కానందం. యింటిలోని కష్ట సుఖాలతో నీకేం అవసరంలేదు. బియ్యం అయిపోయి రెండురోజులయ్యింది. అన్నం లేక రొట్టెలు తింటున్నాం. నీ జీవితంలో యింతకు క్రితం అన్నం మాని రొట్టె ఎప్పుడైనా తిన్నావా?

కృష్ణ: లేదు! అందుకే రొట్టె నాకెంతో రుచిగా వుంది.

చిట్టి: మొండివాళ్ళకు ఎంత చెబితే మాత్రం ఏంలాభం? (యిల్లు తుడుస్తూ వుంటుంది. కృష్ణ కుడివైపుకువెళ్ళి కుర్చీమీద కూర్చుని జేబులోంచి కాగితాలు తీసి చదువుతూ వుంటాడు. ఎడమవైపునుంచి కమలమ్మ వస్తుంది. వయస్సు 40 సంవత్సరాలు. లావుగా వుంటుంది. పెద్ద కుటుంబానికి చెందిన మనిషిలా కనిపిస్తుంది. ముఖంలో ఎప్పుడూ కోపం కనిపిస్తూ వుంటుంది.)

కమలమ్మ: ఒరేయ్ కృష్ణా! (కృష్ణ ఉలికిపడి వెనక్కి తిరిగిచూస్తాడు.) మీ నాన్నగారేం చేస్తున్నారు?

కృష్ణ: వీధిగదిలో కూర్చున్నారమ్మా!

కమ. బజారుకువెళ్ళి వేగం బియ్యం తీసుకురాకపోతే ఏం లాభంలేదని చెప్పు!

కృష్ణ: అదేదో నువ్వే చెప్పేద్దూ!

కమ: (కోపంతో) నీ అఘోరానికి తోడు ఎదురు సమాధానం ఒకటా! వెడతావా? లేదా? (ముందుకు వస్తుంది)

కృష్ణ: (భయంతో) వెడతాను! వెడతాను! (కుడివైపుకు తొందరగా వెళ్ళిపోతాడు. చిట్టి గదితుడిచి నేలమీద పాత తివాసీ పరుస్తుంది.)

కమ: గంటల తరబడి ఒకే పనిచేస్తూ వుంటే ఎలాగ చిట్టీ! లోపల - చిరిగిపోయిన బట్టలన్నీ - బల్లమీదవుంచి వచ్చాను. వేగం కుట్టు.

చిట్టి: యిక అవి కుట్టినా లాభంలేదు. ఇప్పటికి ఎన్నిసార్లు కుట్టాను! నా పరికిణీలు, వాణీలు అన్నీ చిరిగిపోయినై. (విచారంగా) మనం బట్టలు కొనుక్కొని ఎంత కాలమయ్యిందమ్మా?

కమ: ఎంతకాలం అయితే ఏం చిట్టీ! రెండేళ్లనుంచి మనకు బట్టలులేవు. (ఉద్వేగంతో) కూలివాడు సహితం పెళ్లాం పిల్లలకు తిండీ గుడ్డా పెట్టగలడు. మీ నాన్నగారు వట్టి పనికిమాలిన మనిషి. మనం యిన్ని యిబ్బందులు పడుతున్నా ఏం పట్టించుకోరు. యింటితో సంబంధంలేకుండా - వాసాలు లెక్కపెడుతూ - వీధిగదిలో కూర్చుంటారు.

చిట్టి: పాపం! నాన్నగారు మాత్రం ఏంచేస్తారమ్మా! ఆయన జీతమంతా మన కోసమే ఖర్చుపెడుతున్నారు. చిరిగినబట్టలు వేసుకొని యింట్లో కూర్చోడానికే మనకు కష్టంగా వుంది. నాన్న వీధిలోకికూడా వెడుతున్నారు.

కృష్ణ: (ప్రవేశించి) నాన్నగారితో చెప్పాను. కాని ఆయనేం మాట్లాడలేదు.

కమ: నిద్రపోతున్నారేమో!

కృష్ణ: లేదు! ఏదో రాస్తున్నారు.

కమ: (గట్టిగా) రాత పూర్తి అయ్యేవరకూ వుండి చెప్పు. బియ్యంలేకుండా యింట్లో అడుగుపెట్టావా - నీ చెవి మెలేస్తాను.

కృష్ణ: హరి భగవంతుండా!. (కుడివైపు నిష్క్రమిస్తాడు)

కమ: వీ డొకడు! వట్టి పనికిమాలిన వెధవ! రోజంతా నాటకం కంపెనీల వాళ్ళ చుట్టూ తిరుగుతూ భోజనానికి మాత్రం సిద్ధమవుతూ వుంటాడు.

చిట్టి: కృష్ణన్నయ్య చాలా తెలివైన వాడమ్మా! ఎంత బాగా మాట్లాడతాడనుకున్నావ్!

కమ: వాడి తెలివీ నీ తెలివీ అఘోరించినట్లేవుంది. వేషాలు కట్టేవాళ్ళకు మాట్లాడ్డం చేతకాకపోతే యింకేం చేతనవుతుంది! (సాలోచనగా) మన కుటుంబం ఏనాటికైనా మంచి స్థితికి వస్తే [illegible] రావాలి.

చిట్టి: పెద్దన్నయ్య దగ్గరనుంచి యీమధ్య ఉత్తరాలుకూడా రావడంలేదు. పాపం! పట్నంలో ఏమి యిబ్బందులు పడుతున్నాడో!

కమ: వాడి చదువుకు ఎంతో డబ్బు ఖర్చయ్యింది. నా ఆశలన్నీ, వాడిమీదే పెట్టుకుని వున్నాను. మన కుటుంబానికి మంచి రోజులువస్తే వాడివల్లే రావాలి. మీ నాన్నగారివల్ల యీ కుటుంబం బాగుపడుతుందన్న ఆశ ఏనాడో వదులుకున్నాను.

చిట్టి: (ప్రసంగం మారుస్తూ) బట్టలు తీసుకువచ్చి యిక్కడ వెయ్యమ్మా! కుడతాను!

(కమలమ్మ ఎడమవైపుకువెళ్లి పాతబట్టలు తీసుకువచ్చి, తివాసీమీద వేసి వెళ్లిపోతుంది. చిట్టి తివాసీమీద కూర్చుని కుడుతూ వుంటుంది. కేశవరావు వస్తాడు. వయసు 35 సంవత్సరాలు. లావుగా పొడవుగా వుంటాడు బొద్దుమీసాలు. కేశవరావుని చూడగానే చిట్టి కుడుతున్న బటలు వదిలేసి తొందరగా లేచి నిలబడుతుంది.)

చిట్టి: (ఎడమవైపు చూస్తూ) అమ్మా! కేశవరావు మామయ్య వచ్చాడే!

(ఎడమవైపునుంచి కమలమ్మ వస్తుంది.)

కమ: ఏరా తమ్ముడూ! యిదేనా రావడం! అక్కడ అందరూ క్షేమంగా వున్నారా! - కూర్చో!

కేశ: (కుర్చీలో కూర్చుంటూ) ఆ! అంతా క్షేమంగానే వున్నారు. యీవూళ్లో కొంత అర్జంటుపని వుండి వచ్చాను.

చిట్టి: మా అన్నయ్య ఏంచేస్తున్నాడు మామయ్యా ఏమైనా ఉద్యోగం దొరికిందా?

కేశ: వాడికి మా యింట్లో ఏంలోటు! హాయిగా వుంటున్నాడు. యిక ఉద్యోగం అంటావా! నేనుండగా వాడు ఉద్యోగం కోసం ఒకరిని ఆశ్రయించవలసిన అవసరం లేదు. మీ నాన్నగారిలా ఎగుగూ బొదుగూ లేని ఎనభైరూపాయల గుమస్తా ఉద్యోగం చెయ్యవలసిన అవసరం అంతకంటే లేదు.

కమ: అలా అని ఎంతకాలం మీ యింట్లో వుంచుకుంటావ్? వేగం ఏదో ఉద్యోగం చూద్దూ!

కేశ: చూసేదేమిటి? వాడప్పుడే ఉద్యోగం చేస్తూవుంటే!

కమ: (ఆనందాశ్చర్యాలతో) ఏమిటి! ఉద్యోగం చేస్తున్నాడా!!

కేశ: నాకు తెలిసిన ఒక కంపెనీలో అసిస్టెంటు మేనేజరుగా వేయించాను. నెలకు జీతం మూడువందలు.

చిట్టి: (ఆశ్చర్యంతో) మూడువందలు!! (కృష్ణ సంచి చేత్తోపట్టుకొని కుడివైపు నుంచి వస్తాడు.)

కృష్ణ: హల్లో! అంకుల్! హౌ - డు - యు - డు?

కేశ: నువ్వు యీమధ్య ఏదో నాటకం కంపెనీతో మా వూరు వచ్చావట! మా యింటికి రాలేదేం?

కృష్ణ: ఒక పనికోసం వెళ్లి ఏకైపనులు చక్కబెట్టుకు రావడం వ్యాపారస్థుల లక్షణం. కళాకారుడిది ఒకటే లక్ష్యం. (చిట్టితో) ఏమిటే చిట్టీ మూడువందలంటున్నావ్?

చిట్టి: (సంతోషంతో) పెద్దన్నయ్యకు ఉద్యోగం దొరికిందట. నెలకు మూడు వందలు జీతం!

కేశ: (కమలమ్మతో) వాడికి ఉద్యోగం దొరికింది. నిక్షేపంగా ఉద్యోగం చేసుకుంటున్నాడు. పెళ్ళిచేసుకోవడానికి యికే ఆటంకం ఏముంది?

కమ: మగపిల్లాడికి పెళ్లికి తొందరేం వచ్చింది. ఎదిగిన ఆడపిల్లకు పెళ్లి చెయ్యకుండా ఎంతకాలం యింట్లో వుంచుకుంటాం! చిట్టికి ఎక్కడైనా ఒక మంచి సంబంధం చూద్దూ! (చిట్టి సిగ్గుతో ఎడమవైపు నిష్క్రమిస్తుంది.) జోగారావుకు నీ కూతురునిచ్చి పెళ్లిచేద్దామని ఏనాడో అనుకున్నాం. ఆ పెళ్లి యీనాడు కాకపోతే మరోనాడైనా ఎలాగూ జరగక తప్పదు.

కేశ: అబ్బే! వాడిదగ్గర పెళ్లిమాట ఎత్తితే ఏం మాట్లాడ్డంలేదు. వాడి ప్రవర్తన నాకు అనుమానంగా వుంది. కాబోయే అల్లుడు కదా అని నిక్షేపమైన ఉద్యోగం కూడా యిప్పించాను.

కృష్ణ: ఓస్! యింతేనా! అన్నయ్యకు ఉద్యోగం దొరికిందంటే నేనెంతో సంతోషించాను. మామయ్య కూతుర్ని పెళ్లిచేసుకునే ఒడంబడికమీద అన్నయ్యకు ఉద్యోగం దొరికిందన్నమాట. అయితే అన్నయ్య మూడొందల రూపాయల ఉద్యోగంకంటే నాటకం ఒక్కంటికి 15. రూపాయలు దొరికే నా ఉద్యోగమే ఉత్తమోత్తమమైనది.

కమ: (కృష్ణతో) ఒరేయ్! వెధవా! పెద్దవాళ్ల మాటల్లో మాటలు కలపవద్దని నీకెన్నిసార్లు చెప్పాను.

కృష్ణ: అమ్మా! కళాకారుడెప్పుడూ ఖాళీగా కూర్చోలేడు. ప్రతి చిన్న ఘటనకూ అతని హృదయం చలిస్తుంది.

కమ: ఇక నోరు కట్టిపెట్టకపోతే వీపు చిట్లుతుంది. (కేశవరావుతో) వాడు పెళ్లిచేసుకోడేమో అని నువ్వు భయపడక్కరలేదు. ఆ పెళ్లి జరిపించే పూచీ నాది. చిట్టికి మాత్రం వేగం మంచి సంబంధం చూద్దూ!

మీ బావగారి తరహా నీకు తెలిసిందే కదా! ఆయన యివేం పట్టించుకోరు.

కేశ: (లేచి నిలబడుతూ) దానికేముంది. అలాగే చూస్తాను. నీ కూతురు ఒకటే నా కూతురు ఒకటే నా! ఇక పోయివస్తాను. నాకు చాలా పనులున్నాయ్!

కమ: భోజనం చెయ్యకుండా వెళ్ళిపోతావా?

కేశ: తీరికలేదక్కా! మళ్లీ వచ్చినప్పుడు తప్పకుండా భోజనం చేస్తాను.

(కుడివైపుకు నిష్క్రమిస్తాడు.)

కమ: (సంతోషంతో) చిట్టీ! చిట్టీ! (ఎడమవైపునుంచి చిట్టి ప్రవేశిస్తుంది.) ఇన్నాళ్లకు మనం ఒక ఒడ్డుకు చేరుకున్నామే!

చిట్టి: ఈసారి మన కోరికలన్నీ తీరతాయమ్మా! - నెలకు మూడువందలు! - మొన్న వసంత కట్టుకున్న చీరలాంటిది యీసారి నేను తప్పకుండా కొనుక్కుంటాను.

కృష్ణ: అన్నయ్య నైతికంగా తపన ముప్రతాపని ఎన్నడూ అనుకోలేదు.

కమ: (తొందరగా) చిట్టీ! నువ్వు వేగం పోయి అన్నం వండు. ఒరేయ్ కృష్ణా! నువ్వు మీ నాన్నగారి దగ్గరకువెళ్ళి ఆయనకు పంచెలు వగైరా ఎన్ని కావాలో జాబితా రాసుకురా! ఈలోపున యింట్లోకి కావలసినవన్నీ నేను జాతాబి రాసి వుంచుతాను.

కృష్ణ: నువ్వింత తొందరపడ్డం ఏం మంచిదికాదమ్మా! దాహంతో గొంతుక ఆరిపోతున్నవాడికి సముద్రపు నీరుపట్టిస్తే ఏంజరుగుతుంతో తెలుసా?

కమ: (కోపంతో) వెధవకబుర్లూ నువ్వూను! పోయి చెప్పినపని చెయ్యి. (ముందుకు వస్తుంది)

(కృష్ణ కుడివైపుకు - కమలమ్మ, చిట్టి ఎడమవైపుకు నిష్క్రమిస్తారు.—తెర.)

## 2 దృశ్యం.

(అదే గది. కృష్ణతీవ్రంగా ఏదో ఆలోచిస్తూ గదిలో అటూ యిటూ తిరుగుతూ వుంటాడు. మధ్యమధ్య జేబులోంచి కాగితాలు తీసి చదువుతూవుంటాడు. ఎడమవైపునుంచి కమలమ్మ వస్తుంది. ఈసారి విలువైన చీరకట్టుకొని వుంటుంది.)

కమ: ఒరేయ్ కృష్ణా! గానుగెద్దులా అలా గదంతా తిరక్కపోతే - బజారుకు పోయి యింట్లోకి కావలిసినవి తీసుకురాకూడదుట్రా!

కృష్ణ: నాన్సెన్సు! ఎప్పుడూ బజారూ - తిండీ - స్వార్థమూను. క్షణమైనా స్వేచ్ఛగా ఆలోచించుకో నివ్వవుగదా!

కమ: ఇంటివిషయంలో కొంచెమైనా శ్రద్ధలేకపోతే ఎలాగురా? నువ్వుకూడా మీ నాన్నగారిలా ఎందుకూ పనికిరాకుండా తయారవుతావేమోనని నా భయం.

కృష్ణ: అమ్మా! ఇదిగో! చెబుతున్నాను! నువ్వు నాన్నగారిని ఒకమాటన్నా నేను ఒప్పుకోను. నాన్న ఎంత మంచివాడు! అలాంటి మనుషులు లోకంలో నూటికి కోటికీ ఎవరో ఒకరు వుంటారు. కట్టుకోడానికి బట్టలు లేకపోయినా చలించరు. ఇంట్లో బియ్యం లేకపోయినా చలించరు. చివరకు యింట్లో నువ్వూ ఆఫీసులో ఆఫీసరు వేధించినా సరే చలించరు - నిజంగా నాన్న ఎంత ధైర్యశాలి!

కమ: ఓరి దౌర్భాగుడా! అదంతా ధైర్యమా? చేతకాని తనమా?

కృష్ణ: ముమ్మాటికీ అది ధైర్యం. ఎటువంటి కష్టాలకుకూడా చలించకపోవడం ధైర్యం కాక మరేమిటి? ఉదాహరణకు నన్నుచూడు. ఉదయం లేచేసరికి కాఫీ లేకపోతే ఒకక్షణం కూడా వుండలేను. నాన్నగారు రోజంతా భోజనం లేకపోయినా - ప్రశాంతంగా ఆఫీసుకువెళ్ళి ఆఫీసు పని పూర్తిచేసుకొని - తిరిగి యింటికి వచ్చి - మిగిలిన ఆఫీసు కాగితాలు తెల్లవార్లూ రాస్తూ కూర్చుంటారు.

(చిట్టి ఎడమవైపునుంచి వస్తుంది. జార్జెట్ చీర కట్టుకొంది. ఈసారి ఆమెను చూడగానే వాళ్లస్థితిలో అమాంతంగా ఏదో పెద్ద మార్పు వచ్చినట్లు తెలుస్తుంది.)

చిట్టి: పెద్దన్నయ్య వస్తున్నాడని వసంతతో చెప్పానమ్మా!

కమ: నువ్వు యిక వసంతతో తిరగడం అంత మంచిది కాదు. స్నేహమైనా బంధుత్వమైనా సరిసమానమైన హోదాగల వాళ్లతో జరపాలి.

కృష్ణ: (కుర్చీలో కూర్చుంటూ) ఓహో! ఈ రెండు వారాల్లోను మన హోదా పెరిగిపోయిందన్నమాట!

కమ: ఒరేయ్ కృష్ణా! నువ్వు నోటికి వచ్చినట్లు వాగడం మినహా? ముందు పనులు ఆలోచించలేవురా! - వసంతను నీకిచ్చి పెళ్లిచేయాలని వాళ్లమ్మ ఉద్దేశం. మనది ఎటువంటి వంశం! మనక్కీ వాళ్లకీ బంధుత్వం ఎలా కుదురుతుంది? పోనీ వాళ్లకు ఏమైనా కట్నం యివ్వగల శక్తుందా?

కృష్ణ: నేను పెళ్లిచేసుకోకూడదని ఏనాడో నిశ్చయించుకున్నాను. కనక నువ్వలాంటి భయం పెట్టుకోవలిసిన అవసరంలేదు - కళాకారుడెప్పుడూ బంధనాల్లోంచి తప్పించుకోడానికి చూస్తాడు. అతడు స్వేచ్ఛాజీవి!

కమ: అయితే నువ్విక యెప్పుడూ పెళ్లి చేసుకోకుండా బైరాగిలా తిరుగుతావట్రా?

చిట్టి: అమ్మా! నాకో నెక్లేసువుంటే చాలే! యింకేమీ అక్కరలేదు.

కమ: అన్నయ్య రాగానే కొందాం. నేను నీఅంత వున్నపుడు నా మెడ బంగారంతో నిండివుండేది. నీకు ఒక గొలుసు కొనడానికైనా మీ నాన్నగారికి శక్తిలేకపోయింది.

కృష్ణ: కాళిదాసు కాలంలో అందరి మెడలోను బంగారం వుండేదట. రాను రాను బెర్నార్డుషా కాలం వచ్చేసరికి బంగారం అంత పనికిమాలిన వస్తువు మరొకటేదీ లేదని తేలింది.

కమ: ఏం మాటల్రా అవి! లక్ష్మిని అలా అంటే కళ్లుపోతాయి - ఇంతకాలం మనం ఎన్నో యిబ్బందులు పడ్డాం. నేటికి మంచి రోజులువచ్చాయి. ఈ సమయంలోనే నువ్వుకూడా ఒక ఉద్యోగం సంపాదించేవంటే మన స్థితి ఎంతో బాగుంటుంది.

కృష్ణ: అమ్మా! నువ్వు నామీద ఆశలు పెట్టుకోవడం ఏం మంచిపనికాదు. నేను యివేళ కాకపోతే రేపైనా యిల్లు విడిచిపెట్టి కళా ప్రపంచంలోకి వెళ్ళిపోవలిసిందే!

చిట్టి: ఇల్లంటే జ్ఞాపకం వచ్చింది. యింటి అద్దెకోసం మనిషివచ్చాడమ్మా!

కమ: ఇవేళ యిచ్చేద్దాం. నెలకు పాతిక రూపాయలు అద్దె యిస్తూ యిలాంటి పనికిరాని యింట్లో వుండడం నా కెంతమాత్రం యిష్టంలేదు. మన ఖర్చులన్నీ తగ్గించుకొని ఒక శుభ్రమైన యిల్లు కట్టించుకుంటే మన స్థితీ బాగుపడుతుంది. పాటివాళ్లల్లో మనకు గౌరవమూ పెరుగుతుంది.

కృష్ణ: గౌరవ మర్యాదల్ని డబ్బుతో కొలిచేవాళ్లు సమాజంలో వున్నంతకాలం సంఘం బాగుపడదు. చూడమ్మా! మనం జీవనయాత్రలో మూడవతరగతి ప్రయాణీకులం. మనం జీవితాంతం - మొదటి తరగతికేసి చూసి కలలుకంటూ - మూడవతరగతిలో ప్రయాణం చెయ్యవలిసిందే!

(వీధిలో జట్కాచప్పుడు వినిపిస్తుంది.)

చిట్టి: (కుడివైపు చూస్తూ) అమ్మా! అన్నయ్యా! అన్నయ్యా!

(బెడ్డింగు భుజంమీద వేసుకొని జోగారావు, పెద్ద సూట్ కేసు ఒకటి నెత్తిమీద పెట్టుకొని బండివాడు కుడివైపునుంచి వస్తారు. జోగారావు సన్నగా, తెల్లగా, పొడవుగా వున్నాడు. సూట్ కేసు

కున్నాడు. నెత్తిమీద ఈవెనింగు హేట్ వుంది.)

జోగారావు: (బెడ్డింగు కిందపెట్టి దాని మీద కూర్చుని) హమ్మయ్యా! నీటిలోంచి బయటపడినట్టువుంది. (బండివాడితో) ఇక్కడ దించు.

(బండివాడు పెట్టె జోగారావు ముందు పెట్టి డబ్బులు తీసుకొని వెళ్ళిపోతాడు.)

కమ: (జోగారావును ఆపాదమస్తకం చూస్తూ) బాగా చిక్కిపోయావురా!

జోగా: ఉద్యోగం చెయ్యడం అంటే మాటలనుకున్నావా! ఓహ్! ఎంత శ్రమ! ఎంత బాధ్యత! (విసనకర్ర తీసి విసురుకుంటూ వుంటాడు.)

చిట్టి: నేను రాసిన ఉత్తరం అందిందా అన్నయ్యా?

జోగా: నువ్వు రాసిన ఉత్తరం, కృష్ణ రాసిన ఉత్తరం, యింకా యింకా స్నేహితులు రాసిన ఉత్తరాలు అన్నీ అందినై. అందక ఎక్కడకు పోతాయ్! (సూట్ కేసు తెరిచి) యిదిగో! నువ్వు కావాలన్న నెక్లెస్! (తీసి చిట్టికి యిస్తాడు.)

చిట్టి: (సంతోషంతో) ఎంత బాగుందమ్మా! (తల్లికి చూపిస్తుంది.)

జోగా: పండగకు అందరికీ బట్టలు తీసుకొచ్చాను. ఇక ఎవరికీ కొనక్కరలేదు. (కొత్తచీరలు వగైరా తీసి బయట పెడతాడు. కృష్ణవైపు చూస్తూ) ఏరా మూతి ముడుచుకు కూర్చున్నావ్! నీ అతివాగుడు జబ్బు కొంచెం నెమ్మదించిం దేమిటి? ఇదిగో! నీకీ టోపీ పండగ బహుమతిగా యిస్తున్నాను. (పెట్టెలోంచి హేట్ తీసి యిస్తాడు.)

కృష్ణ: (హేట్ పెట్టుకొని చిట్టితో) చూడు చిట్టీ! నేను 'పిగ్మలియన్' నాటకంలోని ప్రొఫెసర్‌లా వున్నానా?

కమ: (జోగారావుతో) కేశవరావు మామయ్యా, అత్తావాళ్లంతా ఖులాసాగా వున్నారా?

జోగా: డబ్బు కలవాళ్లెప్పుడూ ఖులాసాగానే వుంటారు. ఇంకా సంతోషం చాలకపోతే మరికొంత డబ్బు ఖర్చుపెట్టి సంతోషాన్ని కొనుక్కోడానికి ప్రయత్నిస్తారు.

కృష్ణ: నాన్నగారికి జీతం అందిన మొదటిరోజున మనంకూడా ఖులాసాగా వుంటాం. మనకు పాలు, బియ్యం వగైరా అరువుయిచ్చినవాళ్లు మాత్రమే ఆరోజున ఖులాసాగా వుండరు.

కమ: (కృష్ణతో) అక్కడి మంచి చెడ్డలు కొంచెమైనా మాట్లాడుకోనిస్తావా? నీ వధవ వాగుడేనా? (జోగారావుతో) చిట్టికి సంబంధం ఏదైనా చూస్తున్నాడట్రా మీ మామయ్య?

జోగా: వాళ్లు మనకు ఉపకారం చేస్తారని ఎప్పుడూ అనుకోకమ్మా! చిట్టి పెళ్ళి గురించి ఎప్పుడూ మాట్లాడలేదు. ఏమీ ప్రయత్నం చెయ్యలేదు. పైగా తన కో

(42-వ పేజీ చూడండి)

నాటిక:

# అంతా దండుగే

[బగ్గేశంగారింట్లో పూజామందిరంలోనుంచి దేవతార్చన గంట వినిపిస్తుంది. పెద్ద గొంతుక— "లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం- శ్రీరంగ ధామేశ్వరీం - దాసీభూత సమస్తదేవవనితాం - లోకైక దీపాంకురాం..." తరవాత హారతిపళ్లెం దబ్బున క్రింద పెట్టిన చప్పుడు.]

బగ్గేశం: ఏమేవ్? ఎక్కడే? ఉత్త మొద్దుఘటం—ఓ రామా, కృష్ణా లేదు బతుక్కి, ఎంతసేపూ ఆ గొడ్లపాకలోనే ఘస్తుంది. ఏమేవ్!

సోదెమ్మ: (దూరంనించి) ఆ వస్తున్నా.

బ: ప్రసాదం పుచ్చుకోడానికైనా తీరికలేని ఉద్యోగం ఏం వెలగబెడుతున్నావే?

సో: అందుకే చేతులు కడుక్కోడానికి బావిదగ్గర కెళ్ళానండీ.

బ: ఇందా ప్రసాదం.

సో: 'శ్రీ మహాప్రసాదం శిరసా గృహ్ణామి.' ఏదో తండ్రిగారి దయవల్ల ఈ మూర్తానికైనా అబ్బిగాడికి ఆ రెండు అక్షింతలూ పడితే......

బ: ఆ, పడ్డట్టే వుంది. నా డబ్బు అటువంటిది. ఎవర్ని నమ్మితే వాళ్ళే పీకలు తీసేస్తున్నారు. ఆనాడాయి సచ్చిన గుర్రాజుగాడు నేటికి పత్తాలేదు. ఏంటో! ఈ పెళ్ళి - నా ప్రాణాలమీద కొచ్చింది. పట్నం వెళ్లాలంటే పదికరుకులువాడి యదాన పోశాను.

సో: మరి; మన పనిమీద వెళ్లేక ఖర్చులు మనం భరించుకోకపోతే వాడు భరిస్తాడా? ప్రతి దమ్మిడీకి అయిందంటే ఎలాగండీ? అవుతుంది; కార్యం ఖరామత్తూ అంటూ తలపెట్టేక, మరి అవ్వకేం చేస్తుంది?

బ: ఏడిశావ్ వాజ మొహమా! నీ బోడి సలహా ఎవరిక్కావాలి. మనిషన్నవాడు చెప్పినపని చేసు మొలిచినట్టు చేసుకురాక, పట్నం పంపేకదా అని, ఊరు బాబుగాడి సొమ్ముతో సినీమాలూ వేషాలూ విడుస్తూ తగలపడ్డానికా పంపింది?

సో: వినని మాటలూ; చూడని విషయాలూ చెప్పరాదంటారు పెద్దలు. ఎందుకొచ్చింది? ఘడియో! క్షణమో! వస్తాడు - ంటే బాగుండదు. ఓపికపడితే సరి.

బ: నా ఖర్మం కాలీ; నీ చేత కూడా చెప్పించుకొనే రోజులు దాపరించాయి. నా డబ్బు అటువంటిది. నీకూ అదే దుర్బుద్ధి పుట్టింది. ఓపిక పట్టాలిట - ఓపిక! నా మాటంటేనే దివాన్‌బాద్దూర్ చెంగయ్యగారు కళ్ళకద్దుకొని వప్పేసుగుంటారు. ఈవాళా, నిన్నటివాళ్లమా? అసలీ త్రాష్టంగాడు నాలుగురోజులు వెలిగించాల్సిన అవుసరం అక్కడేముందీ అంట?—

సో: వాడూ వస్తాడుగా, అడుగుదురు కానిలెండి!

[గుర్రాజు ప్రవేశం]

సో: అడుగోనండి, గుర్రాజొచ్చేడు. మాటలోనే వచ్చాడు. నాయనికి నూరేళ్ళాయుర్దాయం.

గు: నా ఆయుర్దాయం మాటకేం గానీ అబ్బాయొచ్చాడా?

## దేశరాజు శేషగిరిరావు

బ: ఆ, వచ్చాడు. (కోపంతో) సెలవూ లేకుండా; పేసూ లేకుండా దిగడ్డాడు. ఏదో సిక్కుజేసుకొచ్చాడుట. ఏవిటో ఈ లగ్గరాసికి ఒకదానికొకటి అకునందకుండా- పోకను......

సో: (మాటలోనే అందుకొని) ఆయన కెప్పుడూ ఉన్నదే నాయనా, వళ్ళు మంట - ఇంతకూ వెళ్ళిన కార్యం - కాయా? పండా?

గు: కాయజేసుకొస్తే కాళ్ళిరగ్గొట్టడూ మామయ్య - పండుజేసుకొస్తేనే పళ్లుకొరుకుతున్నాడు కదా?

బ: ఆ! చాలించవోయ్ - నీ వేదాంతం - ఆ చెంగయ్యగాడికి ఇలాంటి సంబంధం దొరకొద్దుటోయ్? నన్ను జూశా! నాపాలిట లక్ష్మిని చూశా అన్నట్లు; అబ్బో జమీందారీ ఏక్టు రానంతకాలం ఏం విరగబడి చచ్చేవాడూ - సాటివాడ్ని కన్నెత్తి మాసేవాడా? మత్తు వదలగానే పొత్తు కావాలన్నాడు. ఆట్టే మాట్లాడితే శేషన్ మేష్టరీ చేసే నా తండ్రికి తలమించిన సంబంధం తెస్తా.

గు: చాలాబాగుంది. మావయ్యా! నువ్వు నేలవిడిచి సాముచేస్తున్నావ్.

బ: ఒరే! త్రాష్టుడా! తాతకు దగ్గులు నేర్పుతున్నావ్! ఊ! గ్రహించానులే! చెబుదూ ఇంతకూ ఏంజేసుకొచ్చావో?

గు: కట్నం పదివేలు. మరో అయిదువేలు చిల్లరలాంఛనాలూనూ.

బ: ఊ! బోడి పదివేలు—ఊ! కానీ ఇంతకూ మాటిచ్చేశావ్!...చెంగయ్యగారి రొట్టె నేతిలో పడ్డది. సాంప్రదాయం కోసం సరే అంటున్నా—కానీ...

కట్నంజూస్తే—

గు: ఊ! చూస్తే! దొబ్బుడాయి. సరే గానీ మన తాహతుకు తగ్గట్టు మన పదిగ్గా బయలుదేరాలి.

బ: శుభం—ఊ—కానీ.

గు: బ్రతికానురా బాబూ—

* * *

[స్థలం: రైల్వేస్టేషను]

బగ్గేశం: "అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానినై—సాక్షి..", సోదెమ్మ (మాటతోనే అందుకొని): ఏమండీ అబ్బిగాడు తెల్లపంట్లాం—కోటూ వేసుకొని గేటుఫారంమీద నడుస్తూంటే అచ్చంగా దొరలా ఉన్నాడుకదండీ! వాడి కందరితోటీ ఏం గొప్ప చనువండీ!

బ: దొరగారేంటే? అసలా కళంతా ఆకోటులోనే వుంది. సర్కారుకోటు విలువే అంత! అదేసుకొని హాయిగా కూర్చుంటే కాశినుంచి రామేశ్వరంవరకూ నాల్గుమాట్లు తిరగొచ్చు. అదేసుకుంటేనే చాలు. వీళ్లు సర్కారుమనుష్యులా అని అనవాళ్లు. ఏం రాజానౌఖరీ! మిగతావాళ్లు గింజుకుంటే అయిందీ ఆఉద్యోగం! వాడు కలత్తావెళ్లి తిండీతిప్పలూ లేక ఒక్కలాయిద్దై చచ్చిచెడీ చాయంగల విన్నపాలన్నట్లు, ఆవంకటిగాడున్నాడు చూశావ్! వాడే పెద్దకిష్టయ్యగారబ్బి - వాడివల్ల అయిందనిపించాను. అక్కడా! అక్కడా ఏదో మేతగాళ్లకు పారేయించేసి వెళ్లిన కార్యం అయిందనుపించుకొచ్చాను. కలకత్తా ఏం మహాపట్టణం! ఆ వెంకటిగాడి బస ఓపత్తాన్ని దొరికిందా? ఏడుపా? (పాడుంచిట్టా తీసిపీల్చి) వాడ్తోఫిపోకిరీ

మనిషీ - జులాయిమనిషీలా కన్పించాడు కళ్లకు. ఆవేషాలూ-ఆ విరగబాట్లూ-మనలో మనమాట ఘట్టిగా ఎక్కడా అనమోకు సుమీ-వాడో కిరస్తానీపిల్లని కూడా వుంచుకున్నాడుట. ఏం తగలాటకం - ఏవిటడగడం. ఆ యిరుకుసందుల్లో ఈగల్లా కొట్టుకుచావాలి; దిక్కుమాలినబాధ - ఈ వెధవ ఉద్యోగాలకోసం.

సో: ఎంత అఘాయిత్యం - యింత జరిగాక ఆకిష్టయ్యగారికి తెలిసిందో లేదో - చెప్పేరా మీరు?

బ: నీతెలివిమండా! ఎక్కడాఅనొద్దే అని నీతో చెపితే - 'చెప్పారా'? అని నన్ను నిలదీసి అడుగుతావేం? అందుకే ఆడవాళ్లతో ఎంతమాత్రం రహస్యం చెప్పగూడదని ధర్మరాజులవారు సెలవిచ్చారు. నా బుద్ధి గడ్డితినీ...

సో: అబ్బా ఎందుకండీ వర్తిసే వళ్ళు వేడెక్కించుకుంటారు. నా మతిమండీ— నాకు తెలీక - నే నడుగుతే...

బ: నీ తెలివి మండడ మేవిటి? నా తెలివే మండే - చెప్పాను. ఇంక ఈ వార్త ఆ కిష్టయ్యగారి చెవినేసి ఆ బ్రాహ్మడి మనస్సు కుళ్లబెట్టి......

సో: బాబూ! మీ కాళ్ళు పట్టుకుంటాను - చేసిన తప్పుకు లెంపలేసుకుంటాను. పెళ్ళివారు కూడా - నలుగురూ నవ్వుతారు. ఏదో మన యిల్లు నిలబెట్టేడు. తండ్రి కడుపు చల్లగా వాళ్ళ తల్లికడుపు చల్లగా - ఎవడు ఎలాపోతే మనకేం - రైలు ఉద్యోగం సామాన్యమా!

బ: ఆ! నిలబెట్టేడు! వాడు నిలబెట్టేదేముందే! నాలుగొందలు తగలేసేనేమో, చేశాడేమో!

సో: అలాగా!

[బగ్గేశంగారి కొడుకు ఏకాంబరం హాడావిడిగా వస్తాడు.]

ఏకాంబరం: ఏమ్రా బండి ఇవాళ పన్నెండు గంటలు లేటు - బరంపురం దాటాక పట్టాలుతప్పి పడ్డాదిట - ఎక్కడి బళ్లు అక్కడే ఆగిపోయాయి. మనం ఇంక వెళ్ళిపోయి - రేపే వేళకే రావాలి - లేవండి.

బ: అదేవిట్రా! శుభమా అంటూ పెళ్లికి జయలుదేరి తిరిగి యింటికి కెళతామా?

ఏ: పెళ్లి కేం చేస్తాం! అంతా దండుక్కొచ్చింది. ఈ రాత్రల్లా ఇక్కడ తిండిలేక ఛస్తామా ఏమిటే? ఇంతమందికీ భోజనాలు కొరుకదా! టిఫిన్ అయినా దొరకదీ రోడ్ సైడ్ స్టేషన్లో!

బ: ఊ! కానీయండి నాయన్లారా! ఎత్తండి మకాం. వెధవ విఘ్నం. ఆదిలోనే హంసపాదు, అందుకే అంటారు. ఆడవాళ్ళు కళ్ళనీళ్ళు పెడితే అయ్యేపనీ అవ్వదనీ - శనిగొట్టు...నిష్కారణంగా నాచేత నాలుగూ వాగించింది - తనో నాల్గు తిన్నాది. ఏదో రామా కృష్ణా అంటూ కడుపులో చల్ల కదలకుండా కూర్చునే నా కొచ్చే తిప్పలా యివి! ఊళ్లో సంబంధం - ఓబయ్యగాడు అరికాళ్ల చర్మం అరిగేలా తిరిగాడు - ఆ గుంటడు వప్పుకున్నాడూ! పట్నం సంబంధం కావాలిట! ఆ దొర

# ★ అంతా దండుగే ★

సానికి కాపురంచేసే తీరే ముఖంలో కన్పించదు. ఊఁ! కదలండి! అందరితో చెప్పు.

గుర్రా: మావయ్యా! నీకు బండి తప్పిందన్న ఆగ్రహం తప్ప పట్నంవాళ్ళిచ్చే కట్నం ఓబయ్య బుర్ర పాతుకు వచ్చినా ఇస్తాడా!

బ: ఏమిటిరా! కట్నం - కట్నం; అని నాపీక నులుముతున్నారు. నాకేం బంగారపు తొడుగు చేయిస్తార్రా ఆ కట్నంతో? ఇస్తే వాళ్లవాళ్ల పిల్లకే దక్కుడు. వాళ్లిల్లదుకే...

ఏ: అబ్బ! ఏమిటండీ! మీ చాదస్తం. ఆ వచ్చినవాళ్లు ఏమనుకుంటారో అన్న ఆలోచనయినా లేదు మీకు.

బ: అమ్మో! నాయనా! నీ గురించే కద్రటా——సరే నా కెందుకులే - సామాను భద్రం. అందర్నీ బళ్ళల్లో కెక్కించు దగ్గరుండి. "పదవే భద్రాద్రికి పాపిష్టి ఘటమా! పదవే భద్రాద్రికి."

* * *

[బగ్గేశంగారిల్లు.]

బ: ఏవర్రా బండికి వేళవుతూంది. అప్పుడనగా బళ్లకోసం వళ్ళిన అబ్బిగాడు యింతవరకూ రాలేదాయిరి. ఏమి మహాత్రమో! ఈమాటు యిదీ తప్పిందంటే నేనా పెళ్ళికి ఛస్తే రాను. ఒఖ్ఖరికీ తొందర లేదు——ఏమిటో!

సో: అవిగోటండీ బళ్లు. ఈ పెళ్లి కాదు గానీ, అబ్బిగాడు ఒఖ్ఖలా నుసైపోతున్నాడు. చిన్న పనికీ, పెద్ద పనికీ వాడే——ఎండల్లా వాడిదే! అడుగో వాడూ వస్తున్నాడు. మేమంతా సిద్ధంగా ఉన్నాం.

బ: అయిందా నీ వాగుడు! సులోచనాలు జోడు లేక చూడలేదు గానీ, లీలగా నాకూ కన్పించాడు. ఏమిటో! నీ కొఖ్ఖదానికే అభిమానం దొర్లుకుపోతూన్నట్లు ఒఖ్ఖలా యిదైపోతూన్నావ్. ఇదెవరింటి పెళ్ళే? వాడి పెళ్లాంకోసం వాడు ఈ తాపత్రయాలు పడుతూన్నాడు కానీ, నీ కోసమా? నా కోసమా?

ఏకాంబరం: (ప్రవేశించి) అంతా తెమిలినట్టేనా?

బ, సో: (ఒక్కసారే) అంతా సిద్ధంగానే ఉన్నాం.

బ: నాయనా, ఒఖ్ఖసారి కాళ్లు కడుక్కొని వెంకటేశులవారికి దణ్ణం పెట్టేసి వచ్చి మరీ ఎక్కు బండి. ఊఁ! దబ్బున రా.

ఏ: అబ్బ! ఏమిటండీ చాదస్తం - మళ్లీ ఈ బూట్లు విప్పాలి - మేజోళ్లిప్పాలి. (సణుగుతాడు)

బ: నీ యిష్టం. అలానే వెళ్లి దణ్ణం పెట్టిరా.

ఏ: సరే. (ఏకాంబరం వెడతాడు)

బ: గుంట వెధవలు పెద్దలమాట వినే రోజులు పోయాయి; ఈ ఇంగిలీషు చదువులొచ్చాక; ప్రజ మరీ మితిమీరిపోయారురా బాబూ. ఎందుకన్నానో అన్న యింగితజ్ఞానం ఉండొద్దూ! (ఏకాంబరం వస్తాడు) ఊఁ! తోలరా అబ్బీ, బళ్లు 'విఘ్నమూ లెడబాపరా! వినాయకా!'

[బళ్లు కదుల్తాయి.]

* * *

[స్థలం: రైల్వే స్టేషన్. స్టేషన్లో బండి వచ్చేముందు గంట మోగుతుంది.]

ఏ: బండొచ్చేస్తున్నది - జాగ్రత్త——సామాను జాగ్రత్త——

[పెళ్లివారి కోలాహలం - ఎక్కే దిగే మనుష్యుల గొంతుకలు - స్టేషన్లో గంటా - గార్డు ఈలా - ఇంజను కూతా - ట్రయిన్ కదుల్తుంది.]

బగ్గే: నరసింహం కూడా ఎక్కాడో లేదో! గుర్రాజూ...

సూరమ్మ (బగ్గేశం కూతురు, వితంతువు): అదుగో పక్క పెట్టిలోనే ఎక్కారండీ - అంతా ఏకాండీపెట్టేలాగున్నది. సుబ్బులు పిన్నీ; రత్తాలూ పిల్లలూ; కనకమ్మ పిల్లలూ; బాలమ్మ పిల్లలూ; నరసింహయ్య; చెంచయ్య; భానోజీ, విశాలక్షుణరావూ, రత్తాలుగారి మరిదీ, అంతా మనకివతలా ఎక్కారండీ.

బ: సరే అయితేగానీ! అమ్మ! నువ్వక్కడ అందర్లోనూ యిష్టానుసారం తిరక్కూడదు. పట్నాల్లో పోకిరీవెధవలెక్కువ. ఏసినీమాపాటలోపాడి మనస్సు మార్చేస్తారు. నా ప్రాణాలమీద కొచ్చిందీపెళ్లి.

సూరమ్మ: అదేమిటండీ నాన్నగారూ! మీరలా చెప్పాలా! నాకుమాత్రం తెలియదూ!

బ: తెలీదూ? అని నన్నే మదలకిస్తున్నావ్? బాధ్యతకలవుండావాణ్ణి కాబట్టి చెప్పాను. ఆడదీ - అరటాకూ ఒఖ్ఖటే అని పెద్దలన్నారు. ఇంకోడైతే నీగురించి ఏడుస్తాడు కీ - ఏదో నేను బ్రతికున్నంతకాలం నాపిల్లలు నీతిగావుండాలనేగా నాఏడుపు - నేను చచ్చాక మీ ఏడుపులు ఎలా ఏడిస్తే అడిగే వారెవరూ?

సో: ఎప్పుడూ వళ్లు మండించుకొంటూనే ఉంటారు. చావో-చావో అంటూ - ఏవీఅనదూ, ఏఖ్ఖడా తిరగదు; దాన్ని నా దగ్గిరే అట్టే బెట్టుకుంటా.

బ: నే నన్నదాంటో తప్పేముందే! దాన్ని వెనకేసుకొస్తున్నావ్!

ప్రక్కవాళ్లు: ఏదోపొరపాటు. క్షమించండి తాతగారు!

బ: నీకేం చెడుగాలమయ్యా తాతగా! రంటావ్. నిండా పిడికెడు ఎముకల్లేవు - అస్థిపంజరంలా వున్నావ్. ఆ పంట్లాం కాస్తా తీస్తే అయిదుశేర్లన్నా తూగవ్ - నాతో తిండి తింటావూ? పోనీ నా దెబ్బ కాగుతావూ?

ప్రక్కయువకుడు: (నవ్వాపుకొంటూ) క్షమించండి తెలియక పొరపాటున నోరు జారింది.

సో: (తనలో గొణుక్కున్నట్లు మెల్లిగా) ఈయనకు చూస్తే వొట్టి ప్రథమకోపం - ఆ పెళ్లి నాలుగురోజులూ, ఎలా వేగుతుందో ఈయనతో.

పుస్తకాలకుర్రాడు: (ప్రయాణీకుల చెవులు హోరెత్తేలా పాడుతాడు.)

"భావి భారత భాగ్యవిధాతలారా!
యువతీయువకులారా!
స్వానుభవమున చాటునాసందేశమిదియే-
పెళ్లిచేసుకొని - ఇల్లుచూసుకొని
చల్లగ కాలం గడపాలోయ్-
మీరెల్లరు హాయిగ నుండాలోయ్-
మీరెల్లరు హాయిగనుండాలోయ్"

బ: అయిందా నాయనా, నీపాట? అలా అటు పక్కకుపో - ఇలాంటి పోకిరీపాటలే పచ్చని సంసారాల్లో నీళ్లు పోస్తాయ్. ఏమీ ఎరుగనివాళ్లకు గంగవెర్రులెత్తిస్తాయి. మదపిచ్చివెధవలు - [తిరిగీపాట]

"కట్నాలమోజులో మన జీవితాలనే బలిచేసి కాపురముల్ గూల్చు ఘనులకు శాస్తికాగ" - (స్వల్పవిరామం)

బ: నోర్ముయ్ - ఇంకా: ఆపాటపాడే

(54-వ పేజీ చూడండి)






## 23

నెల రోజులకు పైగా ఎమరాల్డా కనపడ్డం లేదు. బికారుల నిలయంలో కలవరం బయలుదేరింది. ఎమరాల్డా ఏమయిందో ఎవరికీ తెలియదు. మేక కూడా మాయమయింది. నగరం నలుమూలలా గాలించారు. ఆమె జాడ తెలియలేదు. ఆఖరు పర్యాయం నెల్రక్రిందట ఆమె ఒక సైనికాధికారితో కలిసి ఎక్కడికో వెడుతున్నట్లు మాత్రం ఆచూకీ తెలిసింది. ఎమరాల్డా భర్త అయిన గ్రింగైర్ వేదాంతి. అతనికంత చింత లేదు. ఆత్మరక్షణలో భార్యకు సహాయం అవసరం లేదని అతనికి తెలుసును. ఆమె మెడలోని తాయత్తు ప్రభావం, ఆమె కత్తిపదును అతనికి చక్కగా తెలుసును. అయితే ఇంత ఆత్మరక్షణపరాయణురాలైన ఆమె ఎలా మాయమయిందో అని అతడు కూడా కలవరపాటు చెందాడు. తన కవిత్వరచన కూడా మానుకుని ఆమెకోసం అన్వేషిస్తున్నాడు.

ఒకరోజు గ్రింగైర్ న్యాయస్థాన భవనం ప్రక్కనుంచి నడిచి పోతూ, అక్కడొక గుంపు చేరడం గమనించాడు. సభామందిరంలోనుంచి వస్తున్న ఒక యువకుని అడిగాడు. "అక్కడేమి టివాళ విశేషం?"

"ఏమో! ఒక యువతి సైనికాధికారి నొకణ్ని హత్యచేసిందిట. ఆమెకు మంత్ర తంత్రాలుకూడా వచ్చేమో! అందరూ ఉన్నారక్కడ. మా అన్న క్లాడ్ ఫ్రాలోని డబ్బడగాలని వెడితే, ఆయనకి నా కేసి చూసే తీరికేనా లేదు. మీరేమైనా అప్పివ్వగలరా?"

"అప్పివ్వగల సమర్థతే ఉంటే ఇంక లేనిదేముంది? నా జేబులు చిల్లులు."

క్లాడ్ ఫ్రాలో తనకు తెలుసుననే విషయం చెప్పడానికి జంకాడు గ్రింగైర్. క్లాడ్ ని చూసి చాలరోజులైపోయింది. ఆయనకి ఆగ్రహం వచ్చివుండవచ్చునుకున్నాడు.

గ్రింగైర్ న్యాయసభామందిరం ప్రవేశించాడు. అంతటా నిశ్శబ్దం అలముకునివుంది. మెల్లిగా జనం మధ్యనుంచి జారిచేసుకుంటూ ముందుకు వెళ్ళాడు. లోపల వెలుగు తక్కువగా ఉంది. హాలు విశాలమైనది. సగంవరకూ జనం కిటకిటలాడుతున్నారు. తరవాత న్యాయవాదులు కూర్చునివున్నారు. అపైన ఎత్తైన వేదికపైన న్యాయమూర్తులు కూర్చునివున్నారు. ఆ మసక వెలుగులో అందరూ గ్రింగైర్ కళ్ళకి గొర్రెలు, ఎలుగుగొడ్లు, మొసళ్లు, తాబేళ్ళు, అడవిపిల్లులవలె కనపడుతున్నారు.

"దోషి ఎవరో?" అన్నాడు ప్రక్కనొకనిని చూసి.

"అదుగో! ఆమే. అటు తిరిగి నిలబడింది; నల్లని దుస్తులు ధరించింది."

గ్రింగైర్ మెడమలెత్తి చూశాడు. స్పష్టంగా కనపడలేదు.

"ఆమె పేరు?"

"తెలియదు. ఆమెకి మంత్ర తంత్రాలు వచ్చుట."

అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు. ఒక వృద్ధవనిత సాక్ష్యమిస్తోంది.

"నే నా యింట్లో నలభైయేళ్ళనించి ఉంటున్నాను. నే నెప్పుడూ పన్నులూ అద్దెలూ నాగా పెట్టలేదు. ఒకరోజు రాత్రి నేను నూలు వడుకుతుంటూ వుండగా తలుపుతట్టిన చప్పుడు వినపడింది. ఎవరువారని కేకేసి తలుపుతీశాను. ఒక సైనికాధికారీ, నిలువెల్లా నల్లని దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషీ లోపలికి వచ్చారు. రెండో పెద్దమనిషి ముఖంకూడా కప్పుకొని వున్నాడు; కళ్ళుమాత్రం కనపడ్డాయి. ఆయన కళ్లు చింతనిప్పుల్లా వున్నాయి. నా మిద్దెగది ఆ రాత్రికి కావాలన్నారు. చేతిలో ఒక కాసు పెట్టారు. అది మర్నాడు వాడుకోవచ్చుగదా అని నా మేజా అరలో దాచుకున్నాను. నేను ముందు మెట్లెక్కి మిద్దెగది చూపించాను. వెనక్కి చూసేసరికి ఎప్పుడు మాయమయ్యాడో ఆ రెండో

మూలం :
విక్టర్ హ్యూగో

అనువాదం :
సూరంపూడి సీతారామ్

పెద్దమనిషి కనపడలేదు. నాకు కొంచెం కంగారుపుట్టిన మాట నిజం. సైనికాధికారి యువకుడు; అందగాడు. మిద్దెగది చూసి మళ్ళీ నాతో కిందికి దిగివచ్చి వెళ్ళిపోయాడు. నేను మళ్ళీ రాట్నం దగ్గిర కూచున్నానో లేదో, ఇంతలోనే ఆయన తిరిగివచ్చాడు. ఈ మాటు ఆయనవెంట ఒక చక్కని యువతికూడా వచ్చింది. ఆమె ఎంత అందంగావుందో మాటల్లో చెప్పలేను. నా కళ్ళు చెదిరిపోయాయి. అయితే ఆమె దుస్తులే బాగుండలేదు. ఆమెవెంట ఒక మేకకూడా వచ్చింది. ఆ మేక నల్లటిదో తెల్లటిదో ఇప్పుడు నాకు జ్ఞాపకంలేదు. మేకకి గిట్టలుకొమ్ములున్నాయి. అచ్చంగా మనిషల్లే గడ్డంకూడా వుంది. ఇందులో ఏదో ఇంద్రజాలం ఉందని అప్పుడే అనుమానించాను. అయినా నేనేమీ అనలేదు; నా కాసు నాకు ముట్టింది కాబట్టి. సరే యిద్దరినీ మిద్దెగదిమీదికి తీసుకెళ్ళాను. వాళ్ళనక్కడ విడిచిపెట్టి నేను కిందికి వచ్చేశాను. మేకకూడా వాళ్ళతోనే వుండిపోయింది. మిద్దెగదికి రెండు కిటికీలున్నాయి. ఒకటి నదివైపునుంది. కింద నేను కూచున్న గదికికూడా నదివేపు ఒక కిటికీ ఉంది. నేను మళ్ళీ నా రాట్నందగ్గిర కూచున్నాను. కాని నా మనస్సు మనస్సులోలేదు. ముందొచ్చిన క్రైస్తవసన్యాసి ఏమైనాడు? ఆ తరవాత వచ్చిన మేక అచ్చంగా మనిషిలా చూస్తుంది! ఆ అందమైన యువతి దుస్తులు వింతగా ఉన్నాయి.

"అలా ఎంతసేపాలోచించానో తెలియదు. ఇంతలోనే పైనించి వెర్రికేక ఒకటి వినపడింది. దబ్బున నేలమీద ఏదో పడినట్లు చప్పుడయింది. కిటికీ తలుపులు తెరుచుకున్న చప్పుడయింది. కింద నాగదిలో నదివైపు కిటికీదగ్గిరికి పరుగెత్తుకెళ్ళి చూశాను. నల్లటి ఒక ఆకారం నేను చూస్తూఉండగనే నీళ్ళలో పడింది. అప్పుడు వెన్నెల్లో స్పష్టంగా చూశాను. క్రైస్తవ సన్యాసి వేషంలో ఉందా ఆకారం. గబగబా నదిలో ఆ గట్టుకి ఈదుకుపోయింది. నాకు భయంపుట్టి వీధిలోకెళ్ళి పోలీసుల్ని పిలిచాను. వాళ్ళువచ్చి మిద్దెగదిలో చూశారు. చూసి ఏమనుకున్నారో, నన్ను కొట్టడం మొదలెట్టారు. నేను బతిమాలుకుని వాళ్ళకి జరిగిందంతా చెప్పాను. నన్నుకూడా మిద్దెమీదికి తీసుకెళ్ళి చూపించారు. గదంతా రక్తం మడుగైవుంది. సైనికాధికారి వెన్నులో ఒక కత్తి గుచ్చుకునివుంది. నేలమీద నిలువునా పడుకుని వున్నాడు. యువతి చచ్చిపోయినట్లు నటించింది. మేక హడిలిపోయింది. అయ్యయ్యో అని తల మొత్తుకున్నాను. మళ్ళీ ఆ గది బాగయ్యేసరికి నెల్లాళ్ళు పట్టుతుంది! సైనికాధికారిని మోసుకుపోయారు. ఆమెనీ తీసుకుపోయారు. ఆమె భుజంమీద గుడ్డలేదు! ఇంతే కాదు. అసలు చిత్రం మరొకటి జరిగింది. మర్నాడు చూస్తే మేజాలో కాసు కనపడలేదు. దానిచోట్లో ఎండిపోయిన ఆకొకటి ఉంది!"

హాలంతా జనం ఆశ్చర్యపోయారు. "క్రైస్తవ సన్యాసి రూపంలో దెయ్యం, మేక—అంతా చూస్తే గారడీలా వుంద" అన్నాడు గ్రింగైర్.

"ఎండుటాకో?" అన్నాడొకడు. "అదంతా అతణ్ని దోచుకోడానికి మంత్రకత్తె పన్నిన ఉచ్చు."

గ్రింగైర్ దృష్టికి మొసలిలా కనపడిన ఒక పెద్దమనిషి లేచాడు: "దోషివద్ద కత్తి ఒకటి దొరికింది." అన్నాడు. తరవాత వృద్ధురాలి వంక తిరిగి అడిగాడు "ఎండుటాకు తెచ్చావా?"

"తెచ్చానండి. ఇదిగో!"

ఒకడు ఎండుటాకు అందుకుని 'మొసలి' కిచ్చాడు. మొసలి ఆకుకేసి చూసి తల పంకించాడు; పంకించి అది 'ఎలుగుబంటి' కిచ్చాడు. అది అలా అలా అన్ని చేతులూ మారింది.

ఒక న్యాయవాది లేచి సాక్షిని ప్రశ్నించాడు: "మీయింట్లో మిద్దెగదిమీదికిద్దరు వెళ్ళారన్నావు. ఒకడున్నట్టుండి అంతర్ధానమైనాడన్నావు. తరవాత అతడే నదిలో ఈదుకుపోతూ కనపడ్డాడన్నావు. నీకు కాసు ఇచ్చినదెవరు? సైనికాధికారా, రెండోవాడా?"

వృద్ధురాలొక క్షణం ఆలోచించింది. "సైనికాధికారే ఇచ్చాడు" అంది.

హాల్లో గుసగుసలు బయలుదేరాయి "కేసు పిల్లి మొగ్గలేస్తోంది" అన్నాడు గ్రింగైర్.

ప్రభుత్వంతరఫున ఒక న్యాయవాది లేచి న్యాయమూర్తులతో ఇలా అన్నాడు: "నేను తమకొక విషయం జ్ఞప్తికి తేవాలి. కెప్టెన్‌గారు స్పృహవచ్చినతరవాత ఇచ్చిన వాఙ్మూలంలో ఒక విషయం చెప్పాడు. క్రైస్తవ మతాచార్యుని వేషంలో వచ్చిన దెయ్యం తన్ని బలవంత పెట్టి ఆమెను తప్పకుండా కలుసుకోవాలని ఒత్తిడి చేసినట్లు చెప్పాడు. తనదగ్గిర డబ్బు లేదంటే దెయ్యం డబ్బుకూడా ఇచ్చిందని చెప్పాడు. ఆ కాసే కెప్టెన్ వృద్ధురాలికి ఇచ్చాడు. అందువల్ల ఆ కాసు మంత్రించినదేనని నా వాదం. కెప్టెన్ ఫీబస్ వాఙ్మూలాన్ని పరిశీలించవచ్చు."

ఈపేరు వినగానే దోషి లేచి నిలబడింది. నిలబడగానే ఎస్మరాల్డాను గుర్తుపట్టి గ్రింగైర్ నిశ్చేష్టుడైనాడు.

ఎస్మరాల్డా ముఖం పాలిపోయింది. నిండుగా జడఅల్లి ఉండవలసిన ఆమె కేశరాశి చిందరవందరగా ఉంది. ఆమె పెదవులుకూడా పాలిపోయాయి. కన్నులు గుంటలు పడ్డాయి. ఆమెలో కనపడిన ఈ మార్పుకి గ్రింగైర్ వ్యధ చెందాడు.

"ఫీబస్!" అన్నది వొణికిపోతూ, "ఎక్కడున్నారాయన? ఆయన బతికేవున్నారా?"

"అదంతా నీకనవసరం" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.

"నామీద దయచూపండి. ఆయన బతికున్నారో లేదో చెప్పండి." అంటూ ఆమె బ్రతిమాలింది. చేతులెత్తి మ్రొక్కింది. ఆమె చేతులకు సంకెళ్ళున్నాయి.

"మరణావస్థలో ఉన్నాడు. అది చాలా నీకు? ఇప్పుడు తృప్తిగా వుందా?" అన్నాడు న్యాయవాది.

ఆమె దుఃఖభారంతో కూర్చుండిపోయింది.

ప్రధాన న్యాయమూర్తి ముందున్న గుమాస్తా చెవిలో ఏదో చెప్పాడు. అతడు లేచి "రెండో ఖైదీని ప్రవేశపెట్టండి" అన్నాడు బిగ్గరగా. అందరూ ఆత్రుతతో చూశారు. ఒకప్రక్కనుంచి మేక-డాలీ-తీసుకురాబడింది. డాలీ మెడచాచి ముందుకు చూసింది. తరవాత వెనకడుగు వేసింది. పోలీసులు దాన్ని పట్టుకు ముందుకు నెట్టారు. డాలీ పక్కకు చూసింది. ఎస్మరాల్డా కనపడగానే చెంగున గంతు వేసింది. మేజాపైకి ఒక అంగ, ఒక గుమాస్తా తలపైన మరో అంగవేసి ఎస్మరాల్డావద్దకు దూకింది. ప్రీతితో ఆమె శరీరాన్ని ముట్టెతోనూ ముందుకాళ్ళతోనూ రాయడం మొదలెట్టింది. కాని ఎస్మరాల్డా చలించలేదు.

వృద్ధురాలు మేకవంక చూపుతూ "అదేనండి మేక! అదే" అని అరిచింది.

న్యాయవాది లేచాడు! "రెండో ఖైదీని విచారించాలింక" అన్నాడు.

రెండో వైపు అంటే జాలీ! ఆరోజుల్లో మంత్రాలు నేర్చుకునే నేరానికి జంతువుల్ని శిక్షించడం పెద్దవింత కాదు.

ఒక మతాధికారి లేచి నిలబడ్డాడు. మేకవంక తీక్షణంగా చూస్తూ ఇలా అన్నాడు: "ఈ మేకని ఆవహించిన దయ్యాన్ని కోర్టువారు హెచ్చరిస్తున్నారు—దాన్ని వొదిలి పోకపోతే ఉరిశిక్ష తప్పదు."

గ్రంగెర్‌కి ముచ్చెమటలు పట్టాయి. అతడికి ఎమురాల్నా పైన కంటె మేకపైన ప్రీతి అధికం. ...

న్యాయవాది తంబురతీసి పట్టుకున్నాడు. మేకవంక చూస్తూ తంబుర మీటి "ఇప్పుడెన్ని గంటలైంది?" అన్నాడు.

మేక కేట చూపుల్తో న్యాయవాదిని చూసి, ముందు కాలొక్కటి పిడుసాగా నేలపైన కొట్టింది. అప్పుడు నిజంగానే ఏడు



ప్రకృతి - పడతి

ఫోటో: ఎం. వీరభద్రరావు; (విజయవాడ.)

గంటలయింది. జనంలో కలకలం బయలుదేరింది. గ్రింగ్వార్ ఇది చూసి భరించలేకుండా ఉన్నాడు. "అయ్యయ్యో! సర్వనాశనం! ఇంక దానికి చావు తప్పదు" అని గొణిగాడు.

"ష్! అందరూ నిశ్శబ్దంగా ఉండాలి" అన్నాడు ఒక పోలీసు బిగ్గరగా.

న్యాయవాది తంబుర రకరకాలుగా పట్టుకుని మేకచేత రకరకాల ఆట లాడించాడు. తేదీ, నెల, సంవత్సరం చెప్పించాడు. వీధుల్లో మేక ఆట చూసి ఆనందించి చప్పట్లు కొట్టిన వాళ్ళే, ఇక్కడ అదే చూసి భయభ్రాంతులైనారు.

న్యాయవాది సంచీ ఒకటి తీశాడు. అది ఎమరాల్డా మెడలో ఉండేదే. సంచి మూతి తెరిచి డాలీముందు బోర్లించాడు. డాలీ రెండు కాళ్ళతో అక్షరాలు కలిపి "ఫీబస్" అనే మాట పేర్చింది. దానితో ఎమరాల్డా మంత్రకత్తె అని జనమంతా నిర్ధారణ చేసుకున్నారు.

ఇంత జరుగుతున్నా ఎమరాల్డా కదలనైనా లేదు. డాలీ ముద్దు చేష్టలకుగాని, న్యాయమూర్తులు న్యాయవాదుల బెదరింపులకు గాని ఆమె చలించలేదు. ఒక సార్జెంటు ఆమెను సమీపించి భుజం పట్టి గట్టిగా కుదిపాడు. ప్రధాన న్యాయమూర్తి ఆమె నుద్దేశించి బిగ్గరగా అన్నాడు: "ఎమరాల్డా! నువ్వు జిప్సీజాతికి చెందినదానవు. మంత్రాలు ప్రయోగించి ఈ మేక సహాయంతో మార్చి 29 వ తేదీ రాత్రి కెప్టెన్ ఫీబస్‌ని పొడిచిచంపావు. ఏం సమాధానం చెప్తావు? నేరం చెయ్యలేదంటావా?"

ఎమరాల్డా చేతులతో ముఖం కప్పుకుని ఏడ్వ నారంభించింది "అయ్యయ్యో? ఇదెక్కడి పాపం ఫీబస్?"

"ఏమిటి నీ సమాధానం?"

"నా సమాధానమా? నేను చంపుతానా నా ఫీబస్‌ని?"

"అయితే నీ చర్యల్ని ఎలా సమర్థించుకుంటావు?"

తడబడుతూ ఆమె చెప్పింది "ఇదివరకే చెప్పాను. నాకేం తెలియదు. చేసింది మఠాధికారి. ఆయనెవరో నాకు తెలియదు. నన్ను పిశాచంలా వెంటాడించాడు."

"అదేఅదే! మఠాధికారి అనకు; పిశాచం."

"నన్ను కరుణించండి. నే నేపాపం ఎరగను. నేను పేదరాలిని..."

ప్రభుత్వ న్యాయవాది పేరు జాక్. మెల్లిగా లేచి క్లాడ్ ఫ్రాలో వంక చూశాడు. క్లాడ్ ఫ్రాలో చురుగ్గా చూశాడు. సంకేతం అందుకుని న్యాయవాది అన్నాడు! "ఖైదీ నేరం ఒప్పుకోడంలేదు కాబట్టి హింసించి నిజం చెప్పించాలని కోరుతున్నాను."

"ఒప్పుకున్నాం" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.

ఎమరాల్డా నిలువెల్లా కంపించిపోయింది. సార్జెంటు ఆజ్ఞ విని లేచి నిలబడింది. ప్రభుత్వ న్యాయవాది దారితీశాడు. హాలు కొక మూల దిగువగా ఉన్న ఒక చిన్న తలుపు తెరుచుకుంది. పోలీసుల సహాయంతో న్యాయవాది ఎమరాల్డాను లోనికి తీసుకువెళ్ళాడు. వెంటనే తలుపులు మూసుకున్నాయి. మేక అరిచింది. సభ అంతా ఒకసారి ఉలిక్కిపడ్డారు.

ఒక న్యాయమూర్తి మెల్లిగా తనలో అనుకున్నాడు: "అబ్బబ్బ! ఈ శనిగ్రహం ఎక్కడ దాపురించింది! అప్పుడే భోజనాలవేళయింది; కోరి ఇప్పుడు హింస తెచ్చిపెట్టుకుంది."

ఎమరాల్డా చీకటితోవగుండా నడిచింది. గుండ్రని చిన్న గదిలోకి అందరూ చేరారు. ఈ గదికి కిటికీలులేవు. గాలి వెలుగులు వచ్చే మార్గంలేదు, చిన్న ద్వారం ఒక్కటీ తప్ప. ఒక మూలమాత్రం పెద్ద సెగడు వెలుగుతోంది. ఆ మంట వెలుగులే గది అంతటా వ్యాపించాయి. గదిలో రకరకాల పరికరాలున్నాయి. మధ్యలో ఒక తోలుపరుపు పరిచిఉంది. పరుపుపైన కూర్చుని ముగ్గురు కబుర్లు చెప్పుకుంటున్నారు. నేరస్థులను హింసించి నిజం చెప్పించడానికి ప్రభుత్వం నియోగించింది వారిని. ప్రభుత్వ న్యాయవాది రాగానే వారు లేచి నిలబడ్డారు. వారిని చూసేసరికి ఎమరాల్డా భయంతో కంపించిపోయింది. ఆమె కొకపక్క పోలీసులు, మరోప్రక్క వారితో వచ్చిన మఠాధికారులు నిలబడ్డారు. గదిలో ఒకమూల ఒక గుమాస్తా కూర్చున్నాడు. అతడి మేజాపైన సిరా, కలం, కాగితం ఉన్నాయి.

ప్రభుత్వ న్యాయవాది జాక్ ఎమరాల్డాను సమీపించాడు. నయభావంతో ఆమె నడిగాడు! "అమ్మాయి! ఇప్పుడైనా నిజం చెప్పు. నేరం చెయ్యలేదా?"

"చెయ్యలేదు".

"అయితే నిన్ను కఠినంగా ప్రశ్నించవలసి ఉంటుంది. ఈ పక్కమీద కూర్చో."

ఎమరాల్డా కూర్చోలేదు. ఆ పక్క చూసేసరికి ఆమెకు నవనాడులూ కుంగిపోయి నట్లయింది. జాక్ సంజ్ఞ అందుకుని ఇద్దరామెను జబ్బలు పట్టుకుని పక్కపైన కూర్చోబెట్టారు. ఆమె భీతితో నలుమూలలా చూసింది. మానవుల్ని హింసించే పరికరాలు ఆమెవంక వికటాట్టహాసంతో చూస్తున్నట్లున్నాయి. అవన్నీ వచ్చి తన శరీరాన్ని ముక్కముక్కలుగా కొరుక్కుతింటా యన్నట్లు ఆమెకు తోచింది.

"డాక్టరెక్కడ?" అన్నాడు జాక్.

"ఇక్కడ" అంటూ నల్లని దుస్తులు ధరించిన ఒకవ్యక్తి ముందుకు వచ్చాడు.

జాక్ తిరిగి ప్రశ్నించాడు: "ఇప్పుడైనా నేరం అంగీకరిస్తావా?"

ఈమాటు ఆమె నోటంట మాట రాలేదు. లేదన్నట్లు తల ఊపింది.

"అయితే నాపని నేను పూర్తిచెయ్యాలి" అంటూ జాక్ సంజ్ఞ చేశాడు.

ఎమరాల్డా కుంగిపోయింది. మనుష్యులే కాక దైవంకూడా తనను విడనాడినట్లు భావించింది. జీవంలేనట్లు ఆమె తల వేలాడింది. గదిలో ఇనపయంత్రాలు కంగుకంగు మంటున్నాయి. ఎమరాల్డా గజగజ వణికిపోతోంది. "ఫీబస్! నాఫీబస్! అయ్యో" అంటూ సన్నగా ఏడ్వనారంభించింది. కాని ఈమెను చూస్తే అక్కడివా రెవరికీ కరుణ కలగలేదు. బంపాలు, కప్పీలు, చక్రాలు ఆమెకోసం సిద్ధపరచబడుతున్నాయి. ఒక డాక్టరు ఆమె దుస్తుల్ని మోకాళ్ల వరకు పైకి తొలగించాడు. పారిస్ నగరవాసులంతా చూసి అబ్బురపడిన ఆపాదాల అందం వారికంటికి కనపడలేదు. పాదాలకు ఇనపతొడుగులు తగిలించారు. ఆమె పెనగులాడింది. కాని ఆమె కదలకుండా గట్టిగా పట్టుకున్నా రిద్దరు. కప్పునుంచి వేలాడుతున్న పెద్ద ఇనపకొక్కాన్ని ఆమె నడుముకు బిగించారు. చేతులకు సంకెళ్లు మరింత గట్టిగా బిగించారు.

"ఆఖరుసారి అడుగుతున్నాను చెప్పు. నేరం ఒప్పుకుంటావా?"

"నే నేపాపం ఎరగను."

"అక్కడ జరిగిన కాండకి కారణ మేంచెపుతావు?"

"నాకేమీ తెలియదు."

"సరే కానివ్వండి" అన్నాడు జాక్. కప్పీ తేచింది. ఆమె నడుము ఇనపకొక్కెంలో బిగిసింది. మరొకవైపున పాదం సాగి పోతోంది. ఎదురాడ్లా బాధ సహించలేక బిగ్గరగా అరిచింది; హత్య చెయ్యబడుతున్న పశువులా అరిచింది.

"ఇప్పుడైనా నేరం ఒప్పుకుంటావా?"

"ఒప్పుకుంటాను. అంతా ఒప్పుకుంటాను."

"ఒప్పుకుంటున్నావా? అయితే ఇంకోటి చెప్తున్నా విను. ఒప్పుకున్నా సరే నీకు మరణశిక్ష తప్పదు."

"మరణశిక్షే కావాలి నాకు. ఈ హింస వద్దు."

"రాసుకోవోయ్" అని జాక్ గుమాస్తాకి చెప్పాడు.

"నీకు మంత్రతంత్రాలు వచ్చునని ఒప్పుకుంటున్నావా?"

#  ఘంటారావం 

"ఒప్పుకుంటున్నాను."

"సైతాన్ సహాయంతో అకృత్యాలు చేసినట్లు ఒప్పుకుంటున్నావా?"

"ఒప్పుకుంటున్నాను."

"కెప్టెన్ ఫీబస్‌ని వంచించి హత్యచేసినట్లు ఒప్పుకుంటున్నావా?"

ఆమె కళ్లు పెద్దవిచేసి తేరిపారచూసింది. నేరం అంగీకరించింది.

"ఆమెని విడిచిపెట్టండింక" అని ఆజ్ఞఇచ్చాడు జాక్. "కోర్టులోకి తీసుకురండి."

హింసా పరికరాలనుండి విడివడగానే ఆమె పక్కపైన వాలిపోయింది, వైద్యుడువచ్చి ఆమె పాదం పరిశీలించాడు: "పరవాలేదు. ఎముక విరగలేదే!" అన్నాడు.

అందరూ తిరిగి న్యాయసభా మందిరంలోకి వచ్చారు. నాటకంలో ఆఖరు రంగం సమీపించినప్పుడు ప్రేక్షకులు ఊపిరితీసుకున్నట్టు, సభలో అందరూ ఊపిరితీసుకున్నారు. న్యాయమూర్తులు లేచిపోడానికి సిద్ధపడుతున్నారు. డాలీ సంతోషంతో అరిచింది. మళ్ళీ దూకాలని ప్రయత్నించింది; కాని ఈ మాటు మేకని అక్కడ కట్టివేశారు.

ప్రభుత్వ న్యాయవాది వచ్చి ఒకసారి తన ఆసనంలో కూర్చుని ఇంతలోనే లేచి "ముద్దాయి నేరం అంగీకరించింది" అని చెప్పి మళ్ళీ కూర్చున్నాడు.

ప్రధాన న్యాయమూర్తి ముద్దాయివంక చూసి అన్నాడు: "అంటే ఇంద్రజాలం, వ్యభిచారం, హత్య నేరాలకి నువ్వు అంగీకరిస్తున్నావా?"

ఎమరాల్డా తలవంచుకుని వెక్కివెక్కి ఏడుస్తూ చెప్పింది: "మీరేది చెప్పినా ఒప్పుకుంటాను. నన్నుమాత్రం వెంటనే చంపి వెయ్యండి."

ప్రధాన న్యాయమూర్తి జాక్‌వంక చూశాడు.

జాక్ లేచి పొడుగైన కాగితాలకట్ట ఒకటి విప్పి గబగబ చదివాడు. చదవడం ముగించేసరికి పావుగంట పట్టింది. చదివి డాలీవంక చూశాడు. డాలీ న్యాయవాది ప్రతి అంగచలనాన్నీ, విన్యాసాన్నీ అనుకరిస్తోంది. రోషంతో న్యాయమూర్తుల వంక తిరిగి ఇలా అన్నాడు: "అదుగో అటు చూడండి. ఆ మేకని ఆవహించిన సైతాన్ మన న్యాయ నిర్వహణాన్ని అధిక్షేపిస్తోంది." గబగబా ఇద్దరు పోలీసులువచ్చి మేక ముందుకాళ్ళు రెండూ తాడుతో కట్టివేశారు. ప్రభుత్వ న్యాయవాది ముద్దాయికి కఠిన శిక్ష విధించాలని వాదించాడు. జరిమానా విధించాలనీ, కొన్ని రోజులు నాటర్ డామ్ చర్చివద్ద ఆమె ప్రాయశ్చిత్తం చేసుకోవాలనీ, ప్రాయశ్చిత్తం అనంతరం ముద్దాయినీ, మేకనీ గ్రీవ్ చౌకులో ఉరితియ్యాలనీ కోరాడు. తరవాత టోపీ పెట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు. ముద్దాయి తరఫు న్యాయవాది తన వాదం వినిపించడానికి లేచి నిలబడ్డాడు. "కాలాతీతమయింది. మీవాదం రెండు ముక్కల్లో ముగించండి" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి. ముద్దాయి నేరం అంగీకరించినందువల్ల జరిమానా విధిస్తే చాలునని న్యాయవాది ఒక్క ముక్కలో తేల్చేశాడు. న్యాయమూర్తులు సంప్రదించుకున్నారు. ఎమరాల్డా వారివంక చూసింది. కాని ఆమె చూపుల్లో జీవంలేదు. ప్రభుత్వ న్యాయవాది కోరినట్లు శిక్ష విధించడానికి న్యాయమూర్తులు నిర్ణయించి లేచిపోయారు. ముద్దాయిని పోలీసులు తీసుకుపోయారు.

## 24

మధ్య యుగాలలో నిర్మించబడిన పెద్దపెద్ద కట్టడాలలో భూమిపైన ఎంత కట్టడం ఉండేదో భూమిలోపల దాదాపు అంతా ఉండేది. పెద్ద చర్చీలకు దిగువ ప్రార్థనా మందిరాలో, ప్రాయశ్చిత్త మందిరాలో, గోరీల ఆవరణలో ఉండేవి. రాజభవనాలు, కారాగారాల క్రింద కారాగారాలో, గోరీలో ఉండేవి. అదేరీతిగా పారిస్ న్యాయసభా భవనం క్రింద కారాగారాలు అంతస్థులు అంతస్థులుగా ఉన్నాయి. ఈ భూగృహాలలో గాలీ వెలుగూ కరువు. గుడ్డిదీపాలతో బిక్కుబిక్కుమంటూ ఉంటాయి. ఇక్కడకు చేరిన బందీలు ఇంక శాశ్వతంగా గాలికీ వెలుగుకీ, సకల జీవితాశలకూ తిలోదకా లివ్వవలసిందే. ఇక్కడ ఒకసారి చిక్కినవారి కొక్కటే మార్గం—ఉరికంబం.

ఎమరాల్డా ఈ కారాగారాలలో ఒక గదిలో నిర్బంధించబడింది. న్యాయసభా భవనమంతా ఆమె శిరస్సుకు పైనుంది. అంత అల్పప్రాణియైన సుకుమారిని ఇంతటి కఠోర శిలా సముదాయం మధ్య నిర్బంధించడం అనవసరమే. అయినా ఈ ఖైదీ తప్పించుకుపోతుందనే శంకతో ఇక్కడ నిర్బంధించారు.

గోరీలా ఉన్న ఆ చీకటిగదిలో ఆమెను చూస్తే ఎవరికైనా కరుణ జనించకమానదు. ఎండలో తళతళలాడుతూ నృత్యంచేస్తూ పాడుతూ దుఃఖం పోలికలైనా ఎరుగని ఆ యువతి ప్రస్తుత స్థితి హృదయవిదారకంగా ఉంది. ఇప్పుడామె శరీరానికి గాలిసోకదు; మనుష్యుల కంఠస్వరం వినపడదు; కన్నులలో వెలుగు నిండదు. ఇనపగొలుసుల భారంతో కుంగిపోయి, వొంగిపోయి కూర్చునిఉంది. ఆమెప్రక్క ఒక మట్టికూజాతో నీరు, ఒక రొట్టెముక్క ఉన్నాయి. తేమనేలపై కొంతమేర గడ్డి పరచబడిఉంది. గది పైకప్పునుంచి టపటప నీటిచుక్కలు రాలుతున్నాయి. ఆమె కన్నులముందు గతమంతా దృశ్యచిత్రాలు కట్టింది. ఫీబస్, పారిస్ నగరవీధులు, ప్రొద్దుటెండ, తన నృత్యవినోదం, జనుల హర్షధ్వానాలు, మేక, ఫీబస్ ప్రీతివాక్కులు, మతాధికారి, కత్తి, నెత్తురు, న్యాయసభ, హింస, ఉరిస్తంభం అన్నీ కళ్లముందు కట్టాయి. ఒకొక్కప్పుడు బంగారుకలల్లా, ఒకొక్కప్పుడు పీడకలల్లా అన్నీ మనోగోచరమౌతున్నాయి. ఆ అన్నిటి మధ్యా తన జీవనం, తన సంఘర్షణ ఆమెకు జ్ఞప్తికి వచ్చాయి. చీకటి తెరలపై లీలగా కనపడుతున్నట్లున్న ఈ దృశ్యాలతోపాటు తన గీతాలు, ఎక్కడో ఏ ఆకాశంలోనో తేలిపోతున్న తన పాటలు సన్నసన్నగా ఆమె చెవులలో వినవచ్చాయి. ఆ గదిలో చేరినదిమొదలు ఆమె నిద్రపోనూలేదు; పూర్తిగా మేలుకొనిఉండనూ లేదు. సుషుప్తికీ, జాగృతికీ మధ్య ఒకానొక అవస్థలో ఆమె స్మృతి లీనమయింది. ఆ దుర్భర గాఢాంధకారంలో నిద్రకూ మెలకువకూ, యథార్థానికీ కలకూ, పగటికీ రాత్రికీ మధ్య వ్యత్యాసం అంతరించింది. అట్టి శూన్యావస్థలో ప్రాణి అస్తిత్వభావమే మారిపోతుంది.

ఆ స్థితిలో గది తలుపు ఎప్పుడు తెరుచుకుంటుందో ఆమె వినదు. గది తెరుచుకున్నా కొవ్వొత్తి వెలుగైనా కనపడదు. ఆమె వద్దకొక రొట్టెముక్క వచ్చిపడుతుంది. జైలర్ పరిమిత వ్యవధిలో రావడం తప్ప ఆ గదిలో చలనమే లేదు. పైనుంచి పడే చినుకుల టపటపలు వింటున్నట్లు కూచుంటుంది. కాని ఆ శబ్దం ఆమె చెవులకు సోకదు.

అలా ఆమె ఎంతసేపున్నదో తెలియదు. ఎవరికో మరణశిక్ష

విధించినట్లు లీలగా ఆమెకు గుర్తుంది. తరవాత ఆమెను మోసుకుపోవటం గుర్తుంది. మేలుకొనేసరికి చుట్టూ అంధకారం ఆవరించిఉంది. లేచి ప్రాకబోయింది; కాలిమడమలను బంధించిన ఇనప గొలుసులు నిరోధించాయి. చుట్టూ తడిమిచూసింది. రాతిగోడలు తెలియవచ్చాయి. పక్కన ఎండుగడ్డి చేతికి తగిలింది. మరొకపక్క తేమ తగిలింది. కొంతసేపు గడ్డిపైన కూర్చుంది. తరవాత ద్వారంవద్ద కింది రాతిమెట్టుపైన కూర్చుంది. కొంతసేపు నీటిచుక్కల్ని లెక్కపెట్టింది. లెక్క అంతలోనే విస్మృతిలో పడిపోయింది. తరవాత చైతన్యం కోడిగట్టింది.

ఒకరోజు రాత్రో, పగలో—రాత్రి పగళ్ళు ఆమె కిప్పుడు తెలియవు—తలుపుదగ్గర సవ్వడి వినవచ్చింది. జైలర్ వచ్చినప్పుడు మామూలుగా అంత సవ్వడి కాదు. ఆమె తలయెత్తిచూసింది. తలుపు సందులోనుంచి ఎర్రని వెలుగువచ్చింది. ఇనపగడియ తీసినచప్పుడయింది. దీపం పట్టుకున్న చెయ్యొకటి ఓరగా తీసిన తలుపు సందులోనుంచి ముందు వచ్చింది. తరవాత ఆ వెలుగులో రెండు ఆకారాలు కనపడ్డాయి. వెలుగు అలవాటుతప్పిన ఆమె కళ్ళు చటుక్కున మూసుకున్నాయి. తిరిగి ఆమె కన్నులు తెరిచేసరికి ద్వారం బంధించబడింది. ఒక మెట్టుపైన దీపం ఉంచబడింది. ఆమె ముందొక మానవాకారం నిలబడిఉంది. ఆ మానవాకృతి ముఖం నల్లనిగుడ్డతో కప్పబడిఉంది. శరీరమంతా నల్లనిదుస్తుల చాటున దాగిఉంది. చేతులైనా కనపడ్డంలేదు ఆమె ఆ ఆకారం వంక కొంతసేపు కన్నార్పక చూసింది. ఇద్దరూ మాట్లాడలేదు. ఇద్దరూ శిలా ప్రతిమలవలె ఒకరివంక ఒకరు దృష్టినిలిపి చూస్తూ ఉండిపోయారు. చినుకులశబ్దం, దీపశిఖ రెపరెపలు తప్ప గదిలో చలనం లేదు.

చిట్టచివరికి బందియే ముందు పలికింది: "ఎవరు మీరు?"

"మతాధికారిని."

ఆమాట పలికినరీతి, కంఠస్వరం వినేసరికి ఆమె గజగజలాడిపోయింది.

"సిద్ధంగా ఉన్నావా?" అన్నాడు మతాధికారి.

"దేనికి?"

"చచ్చిపోడానికి"

"ఓ! ఎప్పుడు? ఇంకా ఎన్నాళ్ళకి?"

"రేపు."

ఆశతో ఎత్తిన ఆమె తల మళ్ళీ దించుకుపోయింది.

"అబ్బ! ఇంకా ఒకరోజా!" అంది. "ఇవాళే ఎందుకు చంపకూడదు? ఎప్పుడైనా మీ కొకటేగా!"

"అంత బాధపడుతున్నావా?"

"అప్పుడే నాలో జీవం చచ్చింది. చలికోరలు నన్ను సగం చంపివేశాయి..." అంటూ ఆమె కూర్చుంది. కూర్చుని కాళ్ళు దగ్గరకు పెట్టుకుని గజగజ వణకసాగింది.

మతాధికారి గది కలయచూశాడు: "వెలుగులేదు. వెచ్చని మంటలేదు, అంతా తేమ. అబ్బ" అన్నాడు.

"అవును. అందరికీ వెలుగుంది; ఎండ ఉంది. నన్నెందుకీ చీకటిలో, చలిలో పడేశారు?"

మతాధికారి క్షణంఆగి ఆలోచించాడు. తరవాత అన్నాడు: "నీకు తెలుసునా? ఇక్కడెందుకు పడ్డావో?"

"తెలుసు ననుకుంటాను" అంది. కారణంకోసం తడుముకుంటున్నట్లు నుదురు తడుముకుంది. "కాని నిజంగా తెలియదు" అంది మెల్లిగా. ఉన్నట్టుండి చప్పున అనేసింది: "అబ్బా! ఇక్కడినించి వెళ్ళిపోవా లనుంది. చలి నన్ను పీకేస్తోంది. ఏవేవో నా ఒంటినిండా పాకుతున్నాయి."

"అయితే నాతోరా." అంటూ అత డామెచెయ్యి పుచ్చుకున్నాడు. ఆచెయ్యి ఆమెకు మంచులా తగిలింది.

"అబ్బ! మృత్యుదేవతచెయ్యిలా ఎంత చల్లగావుంది! అయితే మీరెవరు?"

మతాధికారిముఖంపై ఆచ్ఛాదనం తొలగించాడు. ఆమె అతని ముఖం చూసింది. రాత్రింబగళ్ళు ఆమెను వెంటాడిన ముఖం అది. ఫీబస్ తలవెనుక కనపడి కత్తినెత్తి పొడిచిన వ్యక్తి! కత్తితో సమానంగా మెరిసినవి ఆకళ్ళే!

తనకష్టాలకు, తనసర్వనాశనానికి హేతువైన ఆముఖం చూడగానే ఆమెకు చైతన్యం వచ్చింది. ఆమె స్మృతిపై ఇంతవరకూ కప్పబడిన తెర తొలగిపోయింది. జరిగినదంతా ఆమె కళ్ళకు కట్టింది. ఆమెగుండెలో మంట చెలరేగింది. చేతులతో కళ్ళు కప్పుకుంది. "ఎవరు? మతాధికారా?" అంటూ కూలబడిపోయింది. కూర్చుని భయంతో వొణికిపోయింది. ఆమెలో సత్తువ హరించిపోయింది. పావురాన్ని చూసిన గ్రద్దలా మతాధికారి ఆమెవంక చూస్తున్నాడు.

"అమ్మో! ఆఖరయింది. ఇది ఆఖరుసారి కాబోలు! ఆఖరుదెబ్బ కొట్టండి. చంపండి నన్ను. ఇంక భరించలేను" అంటూ మూలిగింది. కసాయిముందు మేకలా తలవంచి మెడ చూపింది.

మతాధికారి నిర్ఘాంతపోయాడు. చివరి కడిగాడు: "నన్ను చూస్తే నీకు భయమా?"

ఆమె జవాబివ్వలేదు.

మళ్ళీ అడిగాడు, అదే ప్రశ్న.

ఆమె పెదవులు కరుచుకుంది. "అవును" అంది. "ఉరితీసేవాడికి చావనున్నవాళ్ళంటే చెలగాటం. నన్ను కసాయిపీడకలలా వెంటాడాడు. ఆకళ్ళు, ఆకసాయివాడే లేకపోతే ఎంత బాగుండేది! ఎంత సుఖంగా ఉండేదాన్ని! వాడే నన్నీనరకంలోకి తోశాడు. వాడే ఫీబస్‌ని చంపాడు." వెక్కివెక్కి ఏడుస్తూ తలెత్తి అతనివంక చూసింది. "ఎవరు నువ్వు? నేను నీకేం అపకారం చేశాను? నేనంటే నీకెందు కంత పగ?"

"నువ్వంటే నాకు ప్రీతి."

ఆమె కన్నులు తుడుచుకుంది. అతనివంక తదేకంగా చూసింది. ఆమెముందతడు మోకరించాడు. ఆమెవంక తీరని తమకంతో చూశాడు. అతని కళ్ళు నిప్పులగూడిరిగా ఉన్నాయి. "నామాట వింటున్నావా? నీమీద నాకు ప్రీతి."

"ఆహా! ఎంతచక్కని ప్రీతి!"

"అవును. సర్వనాశనమైనవాడు చూపే ప్రేమ!"

ఇద్దరూ కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. అంతకంతకతని దేహం కామాగ్నిలో దహించుకుపోతోంది. ఆమె శరీరం మరింత చల్లబడింది.

"ఇటు విను" అన్నాడు మతాధికారి నిగ్రహించుకుని. "నీకంతా చెప్పేస్తాను. నా మనస్సులో నేను చెప్పుకోడానికూడా ఇంతవరకూ వెరచిన సంగతి చెప్తాను, నిన్ను చూడనంతవరకూ నేను సుఖంగానే ఉన్నాను."

"నేనుకూడా" అంది ఎమరాల్డా గాఢనిశ్వాసం విడిచి.

"నామాటకు అడ్డురాకు. అవును. నేను సుఖంగానే ఉన్నానంతవరకూ. నే నొక్క పాపం చెయ్యలేదు. నన్ననగలవారెవరని అంతవరకూ తలెత్తుకుని గర్వంతో తిరిగాను. అందరూ నన్ను గురుభావంతో గౌరవించారు. అందరికీ నేనంటే భయమే. విజ్ఞానమే నా సర్వస్వం అనుకున్నాను. అప్పటివరకూ విజ్ఞానమే నాకు ప్రియసోదరి. కాని నేను జయించానని గర్వపడిన నా ప్రకృతి అప్పుడప్పుడు నన్ను భయపెట్టక మానలేదు. ఉపవాసాలవల్ల,

(53-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 168. గడియారము వారి ఇంటి పేరు

ఎలాగు వచ్చియుంటుంది? పూర్వకాలమున వీరి వంశస్థులు గడియారముల చేయుచుండిరా? అని కోవ్వూరునుంచి బి. యస్. దామోదరముగారట అడుగుతున్నారు.

ఇంటి పేర్లు ఆర్యుల సంప్రదాయము. ఆంధ్రులు ఆర్యులకూ ద్రావిడులకూ మధ్య వారు. ద్రావిడులలో ఇంటి పేరు కాక తండ్రిపేరే కనబడుతుంది. రాయలసీమాంధ్రులు ఇంటిపేరూ తండ్రిపేరూ కూడా వాడి, తరవాతనే వ్యక్తి పేరు కూడా వాడతారు. ఇంటి పేర్లు పరిశీలించినట్లయితే (సర్వేపల్లి, మామిడిపూడి, టంగుటూరిలాగ) ఊళ్ళ పేర్లూ, (జయంతి, శ్రీపాద, వేదుల, మహీధర, లాగ) పౌరుష నామాలూ, (కందుల, నూతి, నేతి, కత్తుల, వసుశాభరణము లాగ) వృత్తినామాలు, (వేదాంతము, ఆవుల, పందిరి,) లాగ ప్రత్యేకతా సూచక నామాలూ కనపడతాయి. గడియారము అన్నది వృత్తినీ ప్రత్యేకతనీ కూడా సూచిస్తుంది.

గడియారము అన్నది మన దేశములో గడియలను సూచించే సాధనానికి పేరు. ఇది నేటి గడియారమువలె మరలతో అల్లినది కాదు. గుండ్రని గిన్నెకు అడుగున చిన్ని రంధ్రము చేసి, దానిని ఒక గూనలోని నీటిలో తేలవేశేవారు. నీరు క్రమంగా గిన్నెలోనికి ప్రవేశిస్తూ గడియ గడియకీ వచ్చే మట్టముదగ్గర గీటు గీశేవారో లేక రెండు గడియలకు ఒక గిన్నె మూడు గడియలకు ఒక గిన్నె చొప్పున పెట్టుకునే వారో, లేక గడియ గిన్నెనే మళ్ళీ మళ్ళీ తీస్తూ వేస్తూ ఒకరు అక్కడే కూర్చునే వారో చెప్పలేము. రాజుల మొగసాల మండపాలమీద ఒక పనివాడు కూర్చుని గిన్నె మునిగినప్పుడల్లా సూర్యోదయానంతరము ఎన్ని గడియలు గడిచాయో అన్ని గంటలు కొట్టుతూ ఉండేవాడు. ఆ మండపాన్ని గడియారము అనడము పరిపాటిగా వచ్చింది.

ఇక ముహూర్త నిర్ణయము - పట్టాభిషేకానికో, వివాహానికో నిర్ణయించిన కాలము - నాటికి సరిగా ఆ కార్యములు జరిపించడానికి కూడా గడియారము అవసరము. రాజుల ప్రాసాదాలలో గంగాజలము గూనలోపోసి, దానిలో బంగారపు గిన్నెను తేలవేశేవారు సూర్యోదయ కాలానికి. ఆ గిన్నె మునిగిన లెక్కలనుబట్టి సరిగ్గా ముహూర్తాలు జరిపించేవారు. జైమిని భారతములో, శివునివివాహానికి ఆరీతిగానే గంగాజలములో భమిడికుండకముసుంచి ఏర్పాటు చేసిన గడియారాన్ని "పెండ్లికొడుకు నెత్తిమీద ఎవరు కట్టినా" రన్న 'అంబిక నెచ్చెలిని చూచి శివుడు నవ్వినట్టుగా రాశాడు పినవీరభద్రుడు. అక్కడ శివుని నెత్తిపైని గంగ, దానిపక్క (నిశాకరపోతము అనగా) బాలచంద్రుడు బంగారపు గిన్నెగా గడియారపు పోలిక చెప్పబడింది. పెండ్లికొడుకు నెత్తిమీదే గడియారమున్నట్లు చెప్పడములో గడియారము పెండ్లికి ముఖ్యముగా ఉండాలన్నట్టు కూడా సూచించబడింది.

ఇక మన ప్రశ్న సంగతి. ఈ రోజులలో కూడా పల్లెటూళ్ళకు పోతే గడియారాలు కొద్దిమంది ఇళ్ళలోనో వుంటాయి. ఆ రోజుల్లో మాట చెప్పాలా? ఆరోజుల్లో గడియారమువారు ముహూర్తములు నిర్ణయించే జ్యోతిష్కులయి వుంటారు. ముహూర్తనిర్ణయమే కాక ఆ ముహూర్త కాలాన్ని తమ ఇంటి గడియారాలవల్ల వారే నిర్ణయించి శుభకార్యాలు జరగడానికి సహాయము చేసి వుంటారు. కనక వంశ పారంపర్యంగా వారి వృత్తికి సాయపడిన గడియారము వారియింటిపేరై కూర్చున్నది ★



## చిట్టిప్రశ్నలకు జవాబులు

—స్త్రీ పురుషుడుగానూ, పురుషుడు స్త్రీగానూ మారడానికి శరీరములో వుండే హార్మోనులు కారణమని శాస్త్రజ్ఞుల ఊహ. అసలు పురుషునిలో కొంత స్త్రీ అంశమూ, స్త్రీలలో కొంచెము పురుషుని అంశమూ వుంటాయి. కొందరిలో ఈ పాళ్లు మారిపోయి, ఎదగడములో నిరోధి అంశ (స్త్రీ అంశయో, పురుషుని అంశయో) బాగా వృద్ధిఅయి మార్పుకి దారితీస్తుంది. మార్పును గురించి వైజ్ఞానికులింకా పూర్తిగా తెలుసుకోలేదు. ఆ అంశలూ ఈ అంశలూకూడా స్ఫుటముగా ఉన్న వ్యక్తిలో మార్పు జరుగుతోందిగాని, అందరు పురుషులలాగే పుట్టిన బిడ్డలో మార్పువచ్చినట్లు వినము, లింగభేదానికి కారణాన్ని చక్కగా తెలుసుకున్ననాడు వైజ్ఞానికులు ఈ మార్పు తీసుకువస్తారు తప్పకుండా.

—సింహాలు ఆఫ్రికా అరణ్యాలలోనూ, భారత దేశములోని కఠియవాడు అరణ్యాలలోనూ వున్నాయి. పులులు ఉన్నచోట్లలో సింహాలుకూడా ఉండడానికి వీలేకదా? అంటే, కాదని చెప్పవలసి వస్తుంది. పులులు దటంగా అల్లుకున్న గిల్లు, తీగలూ ఉన్న చోట నివసిస్తాయి అందుకే వాటి శరీరము మీద చారలు ఏర్పడి, వాటి అలికిడి లేళ్ళకి తెలియకుండా చేస్తాయి ఈ ఏర్పాటునే పరిసరానుగుణ్యత అంటారు. సింహాల

ప్రపంచవిఖ్యాతనాటకకకర్త, మహాజ్ఞాని అని పేరొందిన జార్జి బెర్నార్డుషాను మీ రందరు ఎరిగియే యుందురు. షా చిన్ననాటిస్నేహితుడు ఒక స్కూలు మేష్టరు తన స్కూలుకు షాను రమ్మని ప్రాధేయ పడ్డాడు. షా నిరాకరించలేక వెళ్లాడు.

క్లాసుకు వెళ్ళగా, ఆండ్రోక్లిస్ సింహం కథ చెప్పబడుతోంది. ఆ కథ విద్యార్థులకు క్షుణ్ణంగా చెప్పి సిద్ధం చేశాడు ఆ ఉపాధ్యాయుడు. ఏ ప్రశ్న వేసినా సమాధానమివ్వగలరనే సంతుష్టి వుపాధ్యాయునకు కలిగింది.

షా ఒక కుర్రవానిని అడిగాడు:

"సింహం ఆండ్రోక్లిస్‌ను ఎందుకు తిన లేదు?"

"ఆండ్రోక్లిస్ దయాపరుడు. మంచివాడు కనుక సింహాం అతనిజోలికి పోలేదని" జవాబు వచ్చింది"

అది రైటు కాదని ఇంకొక కుర్రాణ్ణడిగాడు షా.

అతడు దైవభక్తుడు. దేవుని ప్రార్థించుటవల్ల అతనికే అపాయము కలుగలేదని జవాబు చెప్పాడు ఆకుర్రాడు.

ఇలా కుర్రాళ్ళందరూ తలొక సమాధానం చెప్పారు. షా సంతృప్తి పొందలేదు.

నవ్వుతూ,

"అబ్బాయిలూ - మీ సమాధానాలన్నీ తప్పే. సింహం అతణ్ణి ఎందుకు తిన లేదంటే, అతడు శాకాహారి యగుటవల్ల. మీరంతా శాకాహారులయితే ఏసింహం మీజోలికి రాదు" అని షా చెప్పాడు.

యస్. జి. కె. ప్రతాపరావు,
—విశాఖపట్నం.

వర్ణము బూడిదరంగు. అవి మైదానాలమీద ఎక్కువగా విహరిస్తాయి. కనక వాటిరంగు బూడిదరంగు. వాటి ఆహారమైన జంతువులకి అవి కనబడకుండా సాయపడుతుంది ఈ బూడిదరంగు.

—మాంసము తినడము హింస కాదా అంటారా? ఆ లెక్కని కూరలూ, తోటకూరా, దుంపలూ ధాన్యాలూ తినడమూ హింసయే. గింజల్ని పాతితే జీవముగల మొక్కలు పుట్టడము లేదా? మరి ఆగింజల్ని తినేస్తే ఆ జీవాల్ని తినేసినట్టు కాదా?

అయితే శాఖాహారులు జంతువుల్ని తినడము లేదన్నమాటే కాని, జంతువుల అంగములనుండి తయారుచేసిన వస్తువులను మాత్రము ధారాళముగా వాడుతునే వున్నారు. తినడము మాత్రమేనా హింస? జంతువులనుండి తయారుచేసిన కృష్ణాజినములూ, సిల్కుబట్టలూ, మనీపర్సులూ, పటకాలూ, జోళ్ళూ, దువ్వెనలూ, మందులూ, వాడడము హింసకాదా?

బౌద్ధమతము జంతుబలివల్లకాక సత్ప్రవర్తనమువల్లనే మోక్షపదవి చేకూరునని యుద్ఘాటించిన తరువాత జంతుహింస పాపమనీ, జంతువులను భక్షించుట పాపమనీ అభిప్రాయాలు పెరిగి మాంసభక్షణని చాలా మట్టుకు అరికట్టాయి. మాంసభక్షణమీద ప్రసరించిన ఈ నిషేధము భక్షణమీదే కేంద్రీకృతమై ఇతర హింసాపద్ధతులను వదిలివేసింది నేటి కాలములో.

గోజాతిని మహా అభిమానించేస్తున్నామనుకునే భారతీయులకంటె గోభక్షణచేసే పాశ్చాత్యులు గోవులను ఆదరముగా చూస్తారు. మనవాళ్లు ఆవులను కడుపుమాడ్చి చంపుతారుగాని కత్తివేసి చంపరు. వారు తినడముకోసము చంపినా బ్రతికి ఉంచినంతకాలమూ పుష్కలమైన మేత పెట్టి బలంగా తయారు చేసుకుంటారు.

—ఉఱుమునకునూ సముద్రపు టురవునకునూ ఏ సంబంధమూ లేదు. అలాంటప్పుడు ఉఱిమినచో సముద్రపుటురవు తగ్గును అని ఎట్లనగలమూ?

—రాడారు పంపే తరంగాలు ఏదైనా లోహపు వస్తువుకి తగిలితే - అద్దముమీద పడ్డ వెలుతురులాగ - పరావర్తమై వెనక్కి తిరుగుతాయి. ఈ తరంగాలు రాడారుకి తిరిగి చేరి గుర్తించబడితే, ఈ కాల విరామాన్ని బట్టి ఆ వస్తువు ఎంతదూరమున్నదో తెలుసుకోవచ్చును. అంతేగాని అక్కడ మనుష్యు లున్నట్టుగా తెలుసుకోడానికి వీలు లేదు. కనక ఖగోళాల్లో మనుష్యులున్నట్టు రాడారు సూచించలేదు.

—దయ్యాలను గురించి విజ్ఞానవేత్తలెవరూ శోధించినట్టు లేదు. మరి "దయ్యమంటే ఇది" అని ఎలాగ చెప్తున్నారూ? "శరీరమును విసర్జించిన జీవుడు" అని అర్థము చెప్పవచ్చునేమో? జీవుడు శరీరమునుంచి శరీరానికి మారుతూంటాడు అని నమ్మినట్లైతే, ఒక శరీరము విడిచి ఇంకో శరీరములోకి వెళ్లేలోపున ఉండే స్థితినే దయ్యమన్నారనిపిస్తుంది. శాస్త్రరీత్యా చెప్పాలంటే 'జీవుడంటే ఎవరూ?' అని అడగవలసివస్తుంది. సృష్టి అంతా పరిణామమువల్ల ఈ స్థితికి వచ్చిందనుకునే శాస్త్రజ్ఞులకు 'జీవుడు' అనే విజాతీయ పదార్థము మీద నమ్మకముండదు.

చెట్టు జీవము. ఆ చెట్టులో ఒకడే జీవుడుండేమాటయితే, కొమ్మని కొట్టి పాతితే మరొక చెట్టులాగ ఎలాగ వృద్ధి అవుతుంది? మరణోన్ముఖుడైన మానవుని గుండెకాయ అనుకూల వాతావరణము కల్పిస్తే కొట్టుకుంటూనే వుంటుంది. జీవుడు ఎక్కడున్నట్టూ?...జీవుడంటేనే ఫలానా అని తేలలేదు. దయ్యము మాట ఎలాగ తేల్చగలదూ?





మద్రాసు పారీస్ కార్నర్




# అమ్మా!

స్వర్ణ చిరంజీవి



అమ్మా!
నేనొక రంగు మబ్బునై
ఆకాశంలో ఎగిరిపోనటే?
దేశ దేశములు తిరిగి తిరిగి నే
తీయని వానలు వర్షిస్తానే!

అమ్మా!
నేనొక పూల నౌకనై
ఆ సముద్రముల దాటిపోనటే?
వింతదీవిలో రత్నాల్ ముత్యాల్
సంతరించుకొని తిరిగి రానటే?

అమ్మా!
నేనొక మల్లె పూవునై
ఆకులపై నాట్యం చేస్తానే!
గాలిగుర్రముల నెక్కి వచ్చి నే
పూలమువాసన లెగబోస్తానే!

అమ్మా!
నేనొక మిణుగురునైతే
ఆ చీకటిలో కెగిరిపోనటే!
వన్నె వన్నెలా వెన్నెల బంతిగ
మిన్నగ మిలమిల మెరిసిపోనటే?

అమ్మా!
నేనొక కోయిలనైతే
మామిడి తోటకు పారిపోనటే?
కలకల కలమని పంచమస్వరముల
కంఠమెత్తి నేపాడుకోనటే?





(సీరియల్)

# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

R. L. STEVENSON



(గత సంచిక తరువాయి)

ఈ రెండు భిన్న ప్రకృతులలో ఏదో ఒకదానిని నేనిప్పు డభిమానించి వరించవలసివచ్చింది. నాయొక్క రెండు ప్రకృతులకున్నూ సమానంగా వర్తించుచున్న అనుబంధ సూత్రం ఏదంటే, నాకు గల జ్ఞాపకశక్తి- నా పూర్వస్మృతి - జెకిల్ తత్వం అనేది రెండు ప్రకృతులూ కలిసిన ద్వంద్వప్రకృతి. ఈ జెకిల్‌కు మధ్యమధ్య చాలా సున్నితమైన ధర్మమీమాంసలూ భయసందేహాలు కలుగుతూ ఉంటాయి. అప్పుడప్పుడు విరహతాపం పుట్టినట్లుగా హైడ్‌రూపం ధరించి అట్టి అవతారంలో అనేకములైన అద్భుత కార్యాలూ, అతి సాహసకార్యాలూ చేయాలనే దిలాసా కల్గుతూ ఉంటుంది. జెకిల్ గతి ఏమైతే నాకేమి అనే నిర్లక్ష్యభావం హైడ్‌కు ఉంది. కాని, బందిపోటు దొంగవాడు ఎవరికీ పట్టువడకుండా ఏ కొండగుహలో తలదాచుకుంటాడో, ఆ కొండ గుహను మాత్రము సదా స్మరించుకుంటూ ఉంటాడు. అదేవిధంగా తనకు జెకిల్ శరణ్యమని మాత్రము హైడ్ స్మరిస్తాడు. జెకిల్‌కు హైడ్ విషయములో పితృవాత్సల్యంకంటె ఎక్కువైన వాత్సల్యం ఉంది. పుత్రునకు తండ్రియెడల ఉండే నిర్లక్ష్యంకంటె ఎక్కువ నిర్లక్ష్యం జెకిల్ యెడల ఉంది. జెకిల్ అవతారంలోనే స్థిరంగా ఉండిపోదామా అనుకుంటే, యింతకాలంనుంచి నేను రహస్యంగా తీర్చుకొన్న నా సరదాలను అన్నింటినీ చంపుకొనడం అవుతుంది. ఈ సరదాలను యిటీవల నేను పాలుపోసి పెంచినట్లుగా ముచ్చటపడి పెంపుచేసుకొన్నాను. "స్థిరంగా హైడ్ అపతారంలోనే ఉండిపోదామా అంటే, అనేక స్వప్రయోజనలాభములను ఉన్నతాశయములను చంపుకొని, ఒక్క దెబ్బలో సదా శాశ్వతంగా లోకకంటకుడనై, మిత్రుడనేవాడు లేకుండా బ్రతుకవలసివస్తుంది. ఈవిధంగా ఉభయ పక్షములలో ఏదోఒకటి నిర్ణయించుకొని బేరం ఫయిసలు చేసికోవలెనంటే ఈ ఉభయపక్షాలూ సమఉజ్జీలుగా లేవని కన్పిస్తూ ఉంది. ఈ బేరనిర్ణయంలో మరొక విషయం గమనించవలసి యున్నది. జెకిల్‌కు అనేక మనోనిగ్రహాలు ఉండడం చేత, ఈ మనోనిగ్రహాము లనెడి పంచాగ్నుల మధ్య మనోనేదనపడుతూ ఉంటాడు. కాని, హైడ్‌కు ఏది ఎట్లా పోయినా ఎంతపోయినా దాని స్మరణకూడా ఉండదు. నా ప్రస్తుత విపరీతావస్థలో యిప్పుడు ఏర్పడిన యీ ఆత్మవితర్కము మానవుడు పుట్టినప్పటి నుంచీ ఉన్నటువంటి అనాది సిద్ధమైన ఆత్మ విచారణయే. పాపకార్యధోరణిలోపడి, మధ్యమధ్య భయంతో వణుకుతూ, ఉండేటటువంటి వ్యసన పీడితుడైన పాపిని వ్యసనవ్యామోహం ఆత్మభయం అనేవి అటూయిటూ లాగుతూ ఆఖరుకు ఒకవైపుకు యీడ్చుకొని పోతాయి. నావంటి సోదరమానవులందరి విషయంలో సంభవించు విధంగానే నా విషయంలోకూడా జరిగింది. నాలో ఉన్న మంచి ప్రకృతియే నాకు శ్రేయస్కరమని నేను గ్రహించి స్వీకరించాను. కాని, ఆ సత్స్వభావ ప్రకృతిని దృఢంగా స్థిరంగా నిలువబెట్టుకొనలేక పోయినాను.

మూలం : రాబర్ట్ లూయీ స్టీవెన్సన్  అనువాదం : దాసు వామనరావు

 

# మనిషిలో మనిషి



అందుకొరకై కావలసిన సంకల్ప బలము నాయందు లోపించినది.

అవును. వయోవృద్ధుడైన డాక్టరు జెకిల్ అవతారంలోనే స్థిరంగా ఉండడం మంచిదని మనస్సులో కోరుకొన్నాను. ఈ డాక్టరు తన జీవితంలో అసంతృప్తుడు. కాని, మనసార మంచిమంచి కోరికలు పెట్టుకొని నిర్మల భక్తుడై, మిత్రబృందపరివేష్టితుడై, కాలక్షేపం చేయడం ఉత్తమం. కనుక హైడ్ అవతారం దాల్చి నేను అతి రహస్యంగా అనుభవించిన సరదాలకూ, అభినవ యౌవనోజ్వలశక్తికీ, అడుగుల చలాకీకి, నిలకడలేని నాడీవేగానికీ, స్వైరవిహారానికీ ఒక నమస్కారం అని స్థిరంగా నిశ్చయం చేసికొని స్వస్తి చెప్పాను. ఈనిర్ణయం చేసికొన్నప్పటికీ, అంతరాత్మలో ఆశవదో పూర్వజన్మ వాసనలాగున యింకా నాలో మిగిలియున్నది. ఎందుచేతనంటే, సోహోచౌకులో నేను ప్రత్యేకించియుంచిన యింటిని యింకా విడిచిపెట్టలేదు. ఎడ్వర్డు హైడ్ అవతారంలో ధరించుటకై ఉద్దేశింపబడిన దుస్తులు యింకా నాగదిలోనే సదా సిద్ధంగా ఉన్నాయి. రెండుమాసాలవరకూ, నా సంకల్పమును నేను కొనసాగించాను. ఇదివరకెన్నడూ నా జన్మలో నేను అటువంటి మనోనిగ్రహం సాధకం చేయలేదు. అంతటి మహత్తర సాధకం చేశాను. అందుకు నేను పొందిన ఆత్మానందమే నా నిగ్రహానికి బహుమానం. హైడ్ అవతారధారణ విషయమై నేను పొందిన ఆత్మభయ వేదన మొట్టమొదట్లో తీవ్రంగా ఉందిగాని ఆ భయము యొక్క ఉధృతం క్రమేణా నాలో క్షీణించింది. నా ప్రవర్తనను నా అంతరాత్మ హర్షించడంఅనేది పరిపాటియగుటవల్ల దానిమీద గురికూడ పోయింది. హైడ్ అనేవాడు నాలోనే ఉండి, తన్ను విచ్చలవిడిగా విడిచిపెట్టవలెనని నన్ను పీడించుచున్న విధంగా, నాలోని కోరికలు తీగెలుసాగి ఆతీగెలు నన్ను బంధించి బాధిస్తున్నట్లుంది. చిట్టచివరకు, నా నీతికీ నాకట్టుబాటుకూ నేనే నిలువబడ లేకపోయినట్టి ఒక ఏమరపాటు సమయంలో, తిరిగీ మరొకసారి నా కామరూపౌషధమును నేను తయారుచేసి త్రాగివేశాను.

త్రాగుబోతు అయినవాడు తన దుర్వ్యసన లక్షణమును గూర్చి తనలో తాను పలుమార్లు వితర్కించుకొనును. కాని తనకు ఒళ్లుతెలియని మ్యాగ ప్రాయస్థితిలో తాను ఎటువంటి ప్రమాదావస్థల పాలు కాగలడో ఆ విషయమై తలపోయడం, మనస్సులో బాధపడడం, అరుదుగా సంభవిస్తుంది. అయిదువందల పర్యాయములు ఆత్మవిచారణ చేస్తే అందులో ఏ ఒక్క పర్యాయమో అతని మనస్సు ఆ రీతిగా బాధపడవచ్చు. నా పరిస్థితినిగూర్చి తలపోసినప్పుడు నేనుకూడా అదేవిధంగా వ్యవహరించాను. ఎడ్వర్డు హైడ్ యొక్క ముఖ్య తత్వలక్షణము నిర్దాక్షిణ్య దుర్జనత్వమనిన్నీ, ధర్మవిచక్షణా శూన్యత్వమనిన్నీ నేను ఎరిగియుండినప్పటికీ, అందుకుతగిన బందోబస్తు నేనేమీ చేయనేలేదు. ఆ దుష్టప్రకృతి లక్షణాలు మూలంగానే చిట్టచివరకు నా దండన నేను అనుభవించాను. నాలో ఉన్న దయ్యాన్ని నేను దీర్ఘకాలంగా బంధించి ఉంచాను. అందువల్ల ఇక అది ఉండబట్టలేక గర్జన చేస్తూ కట్లు తెంపుకున్నది. ఈ మందును యీసారి త్రాగినప్పుడే నేను అనుకొన్నాను. ఈసారిపట్టపగ్గం లేని అతిభీకరతరమైన దుర్మార్గతత్వం నాలో విజృంభిస్తుందని అనుకొన్నాను. ఈ కారణం వల్లనే అనుకొంటాను ఆపుకోలేని అతి తొందర నాలో ఏర్పడింది. నేను నాలోని నిపీడిత అభాగ్య ప్రకృతియొక్క కూయి వినవచ్చినప్పుడు ఆపుకోలేని అతి తొందర నాలో ఏర్పడింది. జాలిపుట్టించేటటువంటి అట్టి కారణ ప్రేరణం లోలోపల కల్గినప్పుడు, నియమనిగ్రహ భంగ దోషము ఎటువంటి మతిమంతునకైనా కలుగుతుంది—ఆదోషమునకు ఆ వ్యక్తి బాధ్యుడు కాజాలడని భగవంతునియెదుట ప్రమాణం చేసి చెప్పగలను—ఆరోగ్యం సరిగ్గాలేక చికాకు పడుచున్న చేతిబిడ్డ తనచేతిలోని ఆటవస్తువును ఆగ్రహంతో పగులగొట్టుతుంది. నేనుకూడా అంతకంటె ఎక్కువవివేకంతో ప్రవర్తించలేదు. మనలో అధమస్థులైన వాళ్ళయందుకూడా కొందరు ఎటువంటి వ్యామోహ విభ్రాంతులు కలిగినప్పటికీ, కొంతవరకు మనస్సును చిక్కబట్టి తొణకకుండా తిరుగుతారు. అటువంటి స్థిమిత తత్వధోరణినికూడా నేను బుద్ధిపూర్వకంగా

విడనాడు కొన్నాను—ఇక నేను నా వ్యసన వ్యామోహంలో పడడం అంటే అధోగతిలో పడిపోవడమే.

తక్షణమే నాలో రాక్షసావేశం ప్రజ్వలించి తాండవమాడినట్లయింది. నా కప్పుడు కై పెక్కినట్లయింది. నన్ను ఎదిరించలేకుండా పడియున్న మనిషిని దెబ్బమీాద దెబ్బకొట్టాను. అతనిని కొట్టిన ప్రతిదెబ్బకూ నేను చంకలు కొట్టుకున్నాను. కొంతసేపటికి నాకే ఆయాసంవచ్చింది. నా వెర్రి కైపు మిన్నుముట్టిన సమయంలో నాకొక గుండెల్లో రాయి పడ్డట్టు జల్లుమన్నది. దానితో నాకు మంచుతెర విడిపోయినట్లయింది. నా ప్రాణం ఇక నాకు దక్కదనిపించింది. ఆ ఘోర కిరాతకృత్య రంగంనుంచి పారిపోయినాను. నా ఘనకార్యానికి నాలో నేను గర్విస్తూ, వణికిపోతూ, నా ప్రాణంమీాది తీపి అన్నింటికంటే ఎక్కువ ముఖ్యంగా చూచుకొని, పరుగెత్తాను. సోహో చౌకులోని నా యింటికి పరుగెత్తాను. (ప్రమాద భయం అనేది లేకుండా మరింత కట్టుదిట్టం చెయ్యడం కోసం) నా తాలూకు కాగితాల నన్నింటిని నేను ఆహుతిచేశాను. అప్పుడు నా మనస్సు రెండు విధములైన ఉద్రేకాతిశయములతో ఉంది. ఆ ఉద్రేకావేశాలతోనే, నేను చేసిన ఘోరనేరానికి చంకలు కొట్టుకుంటూ, మరికొన్ని అఘాయిత్యాలు మున్ముందు చేయడానికి దిలాసాగా వ్యూహాలు ఊహిస్తూ నన్నుపట్టి పగతీర్చుకోవాలని వెంటాడుతూ వచ్చేవాళ్ల అడుగుచప్పుళ్లకై చెవియొగ్గి ఆలకిస్తూ పరుగెత్తుకొని వెళ్లాను. సరాసరిగావచ్చి మందు తయారుచేసికొన్నాడు హైడ్—ఆ మందు త్రాగేటప్పుడు హైడ్ తనకు తానే స్వస్తి పాడుకొన్నాడు. హతుడైనవానికిదిగో తోడు ఆహుతి అన్నట్లుగా ఆ మందును త్రాగివేశాడు. రూపాంతర పరివర్తన వేదనలు ప్రారంభమైనాయి. ఈ పరివర్తన వేదనలతో హైడ్ రూపం విచ్ఛిత్తు అయిపోయిందో లేదో, హెన్రీ జెల్‌కి పరితాపకృజ్ఞతా భావపరిపూరిత బాష్పలోచనుడై వినమ్రుడై మోకరించి చేతులెత్తి ఆ పరాత్పరునకు నమస్కరించాడు. దుర్వ్యసన వ్యామోహ సంభరిత స్వరూపము ఆపాదమస్తకము విచ్ఛిత్తయినది. నన్ను ఆవరించినమాయ తొలగి పోయినది—నా జీవితపటం అంతా నా కళ్ళముందర కట్టినట్లుగా కన్పించింది. నా బాల్యంలో నేను నా తండ్రితో చెట్టబట్టి షికారు వెళ్ళినది మొదలుకొని, నేను డాక్టరు వృత్తిలో స్వార్థరహితంగా నిర్వర్తించిన కార్యభారములు సహాస్మరించాను అవన్నీ స్వప్నలీలలుగా నాకు కన్పించాయి. ఆనాటి సాయంకాలసమయ ఘోర భీకరపాతకములు కూడా ఆ క్షణంలో నాకు మిథ్యాలీలలుగానే కన్పించాయి: నేను బిగ్గరగా ఏడ్చి వాడినే. నాకు అనేక ఘాతుకదృశ్యాలూ, ధ్వనులూ జ్ఞప్తికివచ్చాయి. నా మనస్సుకు అప్పుడు స్ఫురించిన వాని నన్నింటినీ, స్ఫురించకుండా అణగత్రొక్కివేయుటకై బాష్పధారలతో, భగవత్ప్రార్థనలతో చాలా ప్రయత్నించాను. ఆ సమయంలో నేను చేసి కొన్న మానసప్రబోధములమధ్య, నేను చేసిన మహాపాతక పెనుభూత వికారరూపము నా అంతరాత్మలో తొంగి తొంగి సాక్షాత్కరిస్తోంది. నాకు కలిగిన యీ ఆత్మపరితాపము యొక్క ఉధృతము క్రమేణ తగ్గిపోయినపిమ్మట, ఒకవిధమైన సంతోషం నన్ను ఆవేశించింది. నా ప్రవర్తనవల్ల ఏర్పడిన చిక్కు యిప్పుడు తొలగిపోయింది. ఇక హైడ్ అనే వాడు సాధ్యుడుకాడు. నాకు యిష్టముఉన్నా లేకపోయినా నా సత్ప్రవర్తికి నేను కట్టువడియున్నాను ఆ మాట తలుచుకుంటే నాకెంతో ఆనందమైంది. నేను హైడ్ రూపంలో ఏ రహస్యద్వారంగుండా వెళ్లుతూ వస్తూ ఉండేవాడనో, ఆ ద్వారమునకు విశుద్ధ విరక్తితో తాళంవేసి, తాళముచెవిని నా బూటుకాలిక్రింద వేసి త్రొక్కి విరుగకొట్టివేశాను.

మరునాడు హత్యనుగూర్చిన వార్తలు వచ్చాయి. హత్యజరుగుతూ ఉంటే పైనుంచి చూచినవాళ్లు ఉన్నారనీన్ని, హైడ్ అనేవాడే నేరస్థుడనన్ని లోకానికి విదితమైంది. చంపబడిన మనిషి ప్రజాగౌరవంగల ఘరానా మనిషి అని వెల్లడిఅయింది. అది పెద్దనేరంమాత్రమే కాదు. చాలా విషాదకరమైన బుద్ధిజాడ్యము—ఇదంతా యిప్పుడు నాకు తెలిసి వచ్చినందుకు నాలో నేను సంతోషించాను. నన్ను ఉరితీస్తారేమో అనే భయంతో నా సద్గుణ ప్రవృత్తిని నాలోనుంచి పారిపోకుండా కాపాడుకుంటున్నాను. ఈమృత్యుభీతిని దానికెదురుగా బెదురుగా పోటీపెట్టగల్గినందుకు నాలో నేనే సంతోషించాను. జెకిల్ అనే మూర్తి



# మనిషిలో మనిషి



నాకిప్పుడు దుర్గమశరణ్యాం అయింది. హైడ్ అనే స్వరూపం బయటికి తొంగిచూచిందంటేచాలు. వానిని పట్టుకొని చంపివేయడానికి ఎంతమంది చేతులో పైకి లేస్తాయి.

ఇకముందు నాప్రవర్తనఅంతా మార్చివేసికొని, నా అపరాధములకు నేను ప్రాయశ్చిత్తం చేసికో దలంచినాను. ఈ రీతిగా నేనుచేసికొన్న దృఢనిశ్చయం కొంతవరకు ఫలించిందని చెప్పగలను. గతసంవత్స రాంత్యమాసములందు కష్టజీవులబాధలను తొల గించుటకై నేనెంతగా కృషిచేశానో నీకే తెలుసును. నేను లోకహితార్థంగా చాలా చేశాను. ఆ దినము లన్నియు ప్రశాంతంగా గడచిపోయినాయి. నా మన స్సుకు కూడా అప్పుడు హాయిగాఉంది. ఈ విధమైన నిష్కపట, పరోపకార జీవితమును కొన్నాళ్లు గడపగా నాకు అట్టి జీవిత ధోరణిమీద విసుగుపుట్టిందని నేను చెప్పలేను. ఎందుచేతనంటే ఆవిధంగా కాల మును గడపుటవల్ల నా మనస్సు రోజురోజుకూ మరింత ఉల్లాసంగా ఉండేది. కాని నాలోఉన్న ద్వంద్వప్రకృతి, నాకుగల భిన్నజీవితాభిలాషలూ నన్ను పీడిస్తూనే ఉన్నాయి. నాకుకలిగిన మనస్సంతాప దీప్తి తగ్గిపోయిన తర్వాత, నాలో యిటీవల అణగద్రొక్క యుంచబడి నట్టియు, అంతకుపూర్వము చిరకాలంగా యథేచ్ఛగా ప్రవర్తించినట్టియు, నాలోని నికృష్ట నీచప్రకృతి తిరిగీ తనకు స్వేచ్ఛావకాశము కావాలని నాలోగుర్రుపెట్టడం సాగించింది. హైడ్‌యొక్క మూర్తిని తిరిగీ బయటికి తీసికొనిరావాలని నేను కలలోనైనా కోరడంలేదు. ఆ మాట మనస్సులో అనుకుంటే చాలు నాకు ఒళ్లు కంపించిపోతుంది. నాకుఉన్న ప్రస్తుతరూపంలోనే, నా మనస్సాక్షినీ నా అంతరాత్మనూ లెక్కచేయకుండా కొంచెం స్వైరవిహారం చెయ్యాలనే కుతూహలం ఏర్ప డింది. సాధారణంగా చాటుమాటు దుర్మార్గాలుచేసే ప్రతి పాపాత్ముడు ఏ విధమైన వ్యామోహాభిలాషకు పాల్పడుతూ ఉంటాడో, అదేవిధంగా నా మతిభ్రమ లకు నేనుకూడా లొంగిపోయినాను.

ఏ కథకైనా ఒక అంత్యం అనేది ఉంది. ఎంత పెద్ద ఘటమైనా నింపగా నింపగా నిండి పొర్లిపోతుంది. ఇప్పుడు నేను దుష్టప్రవృత్తికి కొంతఅవకాశంఇచ్చాను. కొద్దికాలం దాని ఆటసాగనిచ్చాను. ఇదే నాఅంతరాత్మ యొక్క సమస్థాయిని పూర్తిగా చెడగొట్టింది. అప్పటి కిన్నీ, నేను బేజారైపోలేదు. ఈ కామరూపౌషధ మును కనిపెట్టక పూర్వము నేను ఏవిధంగా ఉండే వాడినో, ఆధోరణిలోనికే నేను వస్తున్నానన్నట్లుగా నాలో సహజక్రమానుగతంగామార్పు కన్పించింది. అది జనవరి మాసం. అది పగటిపూట. ఆకాశం నిర్మలంగా ఉంది. నేలమీద కురిసిన మంచు అంతా కరిగి నేల తడితడిగా ఉంది. రీజెంటుపార్కు ఉద్యానవనంలో శీతకాలపు పక్షులు కిచకిచ లాడు తున్నాయి. వసంతాగమన సువాసనలు పరిమళిస్తు న్నాయి. అక్కడ ఆపార్కులో ఎండలో ఒక బల్లమీద కూర్చున్నాను. నాలో అణగియున్న మృగ ప్రవృత్తి ఎట్లాఎట్లా ప్రవర్తించినదో ఆ పూర్వవిష యాలను స్మరించుకొంటూ లోలోపల లొట్టలు వేస్తు న్నాను. నాలోని దైవభక్తి ప్రవృత్తి ఆ ముహూ ర్తంలో మందగించి కునికిపాట్లు పడుతూఉంది. అవ సరమైతే, పశ్చాత్తాపపడవచ్చు, ప్రాయశ్చిత్తం చేసికో వచ్చుఅనేధోరణిలోఉంది అది. కాని, అట్టి పశ్చాత్తాప ధోరణికి అది యింకా రాలేదు చుట్టుప్రక్కల ఉండే సాటి వాళ్ళందరిమాదిరిగానే నేనుకూడా ఉన్నానని నాలో నేను భావించుకొన్నాను. ఇతర మానవులతో నన్ను నేను సరిపోల్చుకొని ఒక చిరునవ్వు నవ్వు కొన్నాను. నా సద్గుణవినియోగాచరణలనూ, అట్టి సద్గుణముల నిర్దాక్షిణ్య నిర్లక్ష్య నిరుపయోగమునూ సరిపోల్చి నాలో నేనే తేడా చూచుకున్నాను. ఈ అహంభావ భావాలు నా తలలో తిరుగుతున్నముహూ ర్తంలో నా ఒళ్లు జలదరించి కంపించింది. తల తిరిగి పోయినంత పైత్యవికారం కలిగింది. శరీరం గజగజలాడి పోయింది. ఇవన్నీ క్రమేణ తగ్గిపోయినాయి. కాని నేను మూర్ఛపోయినాను. ఈ మూర్ఛనుంచి తెప్పరిల్లినాను. అప్పుడు నా భావముల పోకడఅంతా మారిపోతున్నట్లుగా గ్రహించాను. నాలో తెగింపు ఎక్కువైంది. ప్రమాదం అంటే లక్ష్యం పోయింది. ఎవనితోనూ ఏ మొగమాటమూ ఉండనక్కరలేదనే భావం ఏర్పడింది. నేను తలవంచి చూచాను. నా

(38-వ పేజీ చూడండి)

# హాజరులేని నౌకర్లు

కొంపల్లి బ్రహ్మానందం

“ఓమ్మాయ్, లక్ష్మీ!” అని పిల్చాడు దొడ్లో ఆడుకుంటూన్న కూతుర్ని తండ్రి సుందరయ్య.

గబగబా నీళ్ళ గదిలోకి వెళ్ళి శుభ్రంగా చేతులు కడుక్కొని పరికిణీతో తుడుచుకుని తండ్రిముందుకు వచ్చి, “ఎందుకునాన్నా! పిల్చావ్?” అంది లక్ష్మి.

“అబ్బెబ్బె! బట్టలనిండా ఆ ఎర్ర మట్టి ఏమిటి?” అనడిగాడు తండ్రి.

“ఏమి లేదునాన్నా! మరీ...మరీ ......”

“తెలిసిందిలే. మట్టిలో ఆడి ఉంటావ్. ఇకనుంచి అలాఆడకేం?”

“ఆడను లే” అంటూ లక్ష్మి నవ్వుకుంటూ వెళ్లిపోబోయింది. ఇంతలో సుందరయ్య, అపుడే వెళ్ళకు మరీ! అసలు నిన్ను పిల్చిన కారణం వేరే ఉంది. ఇలా రా,” అన్నాడు.

లక్ష్మి ఎగురుకుంటూ వచ్చింది.

“మరి–నేను–ఊరికి పోతున్నాను. ఇంట్లో అమ్మకు తోడుగా వుండి ధైర్యంగా ఉంటావా?” అని అడిగాడు కూతుర్ని.

“నిన్న వచ్చి అపుడే ఏవూరు పోతావ్ నాన్నా?”

“అర్జంటుగా ఈ రోజు కూడ పోవాల్సివచ్చింది తల్లీ! భయం లేకుండా ఉండు, సరేనా?”

“ఏమో నాకు భయంగా వుంది నాన్నా”





"ఏడేళ్లు ..ఏడేను, ఊ. ఊ సెంభై మూడు !"
ఫోటో.
ఎస్. ప్రమీలా దేవి.



"వేషాలు వెయ్యకు. నాన్నగార్ని పోనియ్యి. నేను ఉన్నానుగా. ఫర్వాలేదు" అని ధైర్యం చెప్పిందితల్లి సత్యవతమ్మ.

"ధైర్యే సాహసే లక్ష్మీః" సరేనా? అన్నారు నాన్నగారు వెళ్లుతూ.

"సరేలే నాన్నా. భయం లేదులే. నువ్వుపో." అంది చిలిపిగా.

సుందరయ్య సూటుకేసు పట్టుకుని వెళ్లిపోయాడు లక్ష్మి మళ్ళీ గంతు లేస్తూ దొడ్లో మట్టిదిబ్బ మీదికి పోయింది ఆడుకోటానికి.

కూతురిచేష్టలు చూస్తూ ఉత్త 'పిచ్చిపిల్ల' అనుకుంది తల్లి.



ఆ రాత్రి ఇంట్లో ఒంటరిగా తల్లీ కూతురూ పడుకున్నారు. పనిమనిషి ఆరోజు రాలేదు. ఇంటికంతటికి వాళ్ళిద్దరే ఒకరికొకరు ధైర్యంగా ఉందాం అంది. భయపడ్తూన్న కూతురికి ఎంతసేపో తల్లి చెప్పగా చెప్పగా, కొంచెం ధైర్యంవచ్చింది

# హాజరులేని నౌకర్లు

"పిచ్చితల్లీ! "ధైర్యే సాహసే లక్ష్మీః" అన్నారు పెద్దలు. భయం లేదు. నేను రేపు రాత్రికల్లా వచ్చేస్తాను. అమ్మదగ్గర ఈ రాత్రికి పడుకో. భయం వుండదు."



"ఊఁ...ఊఁ..."

"ఏమిటే మూలుగుతున్నావ్?" అంటూ తల్లి ప్రవేశించింది.

"నేను వూరికి పోతే దానికి భయంగా వుంటుందట!"

"బాగుంది. అసలు భయం అంటే ఏమిటో చెప్పు లక్ష్మి. అది ఎలాగుంటుందో మేమూ చూస్తాము!"



లక్ష్మి నోరు తెరుచుకుని ఆలోచిస్తుంది.



"నలభై మూడా? హా, హా హా"
ఫోటో.
ఎస్. దుర్గాకుమారి.



"అవ్వా! అవ్వా! నీ పళ్లేవి?"
ఫోటో: టి. పార్వతి (విజయవాడ)

విజయవాడ (సత్యనారాయణపురం) మునిసిపల్ హైస్కూలులో పై తరగతుల విద్యార్థులకోసం ఇటీవల ఏర్పాటైన 'హాబీ సెక్షన్'లో ఫొటోగ్రఫీ కూడా ప్రవేశపెట్టారు. ఆ స్కూలు విద్యార్థినులు నలుగురు తీసిన ఫొటోలను యీ సంచికలో ప్రచురిస్తున్నాము. —సం॥

ధైర్యానికి సంబంధించిన కథలు కొన్ని యథార్థమైనవీ, కొన్ని కల్పితమైనవీ చెప్పింది సత్యవతమ్మ. లక్ష్మి అన్నింటినీ నమ్మి ధైర్యంగా వుంది 'ఊ' కొట్టా రాత్రి పదిగంటలయిన తర్వాత నిద్రపోయింది. తర్వాత సత్యవతమ్మ లక్ష్మిపక్కలోనుండి తన పక్కమీదకు వచ్చి పడుకుంది.

రాత్రి దాదాపు ఒంటిగంటపైన అయిఉంటుంది. ఎవరో ఇద్దరు వ్యక్తులు లోపలికి ప్రవేశించి ఆఫీసు గది తెరిచారు. ఆ చప్పుడుకి సత్యవతమ్మకు మెళకువ వచ్చింది. లోపల గుసగుసలాడటం విని తనూ ధైర్యంగా ఆగదిలోకి పోయింది. వాళ్ళిద్దర్నీ చూడగానే ఆమె భయపడి 'దొంగ,' 'దొంగ!' అని అరిచింది. కానీ మొదటిసారిఅరవగానే వాళ్ళిద్దర్లో ఒకడు ముందుకు వచ్చి "అరిచావంటే ఈ కత్తితో పొడుస్తాను జాగ్రత్త" అంటూ ఓ కత్తి ఎత్తాడు. సత్యవతమ్మ నోటంట మాట రాలేదు. అలాగే స్తంభించిపోయి, గజగజ వణికిపోతున్నది.

ఈ చప్పుడుకు లక్ష్మికి కూడా మెళకువ వచ్చింది. 'కత్తి తీసుకుని పొడుస్తాను' అనే మాటలు విని భయపడింది. లేద్దామనుకుంది. కానీ లేవలేకపోయింది. దుప్పటి నిండా కప్పుకుని కళ్లు గట్టిగా మూసుకుని పడుకొంది. ఇంతట్లో మళ్ళీ మాటలు

(43-వ పేజీ చూడండి)



"ఆడోళ్లు కూడా ఫొటోలు తీస్తారు!"
ఫొటో
పి. సరోజనీదేవి.

# మనిషిలో మనిషి

(34-వ పేజీ తరువాయి)

అవయవాలు కుదించుకొనిపోయినాయి. నా పొట్టి చేతులకూ కాళ్ళకూ నాదుస్తులు పొడుగై జీరాడుతూ వ్రేలాడుతూ ఉన్నాయి. నా మోకాలుపై ఆనింపబడిన చేతిమీదినరాలు మోటుగా పేనినట్లున్నాయి. చేతిపైన అంతా వెంట్రుకలు మొలిచిఉన్నాయి. నేను తిరిగీ ఎడ్వర్డుహైడ్ అయినాను. ఒకక్షణమునకు ముందు నేనులోకానికి గౌరవపాత్రుడనై ఉపద్రవ భయరహితుడనై శ్రీమంతుడనై సకలజనాభిమాన పాత్రుడనై ఉన్నాను. నా భోజనశాలలో నాకోసం భోజనం బల్లమీదఅమర్చబడి తెల్లనివస్త్రం కప్పబడి ఉంది. ఇప్పుడు నేను లోకమెరిగిన హంతకుడను. ఉరిస్తంభానికి మెడయొగ్గవలసిన గులామును. లోకము వేటాడుచున్న మృగాన్ని - ప్రపంచం అంతా త్రవ్వి పరిశోధిస్తున్న రాళ్ళగుట్టను నేను. ఇప్పుడు ఇల్లువాకిలి లేని నిరాధారుడను నేను.

నాబుద్ధికి స్థిమితం పోయింది. కాని, అది నాకు పూర్తిగా స్వాధీనం తప్పిపోలేదు. నాయొక్క యీ రెండవ ప్రకృతియందు, నేనిదివరలో పలుమార్లు సూచించియుండిన ప్రకారంగా, నా తెలివితేటలు ఎక్కువ చురుకుగా, నూరిన కత్తిలాగున ఉంటాయి. నాధైర్యసాహసం వంచిన విల్లులాగున ధాటీగా ఉంటుంది. ఆ కారణంచేతనే, జెకిల్ యొక్క ప్రకృతి బేజారైపోయే పరిస్థితులలో, హైడ్ సమయస్ఫూర్తి కలిగి నడుముకట్టి కార్యసాధకుడయ్యేవాడు. నామందులన్నీ నాగదిలో ఒక బీరువాలో ఉన్నాయి. కాని, అక్కడికి నేను వెళ్ళడం ఎట్లా? (నాకణతలను రెంటినీ గట్టిగా నాచేతులతోనొక్కి) ఏమిటి కర్తవ్యం అని ఆలోచించాను. పరిశోధనా మందిరంలోనికి వెళ్లే తలుపును నేను ఇదివరకే బంధించి వేశాను. ఇంటి ద్వారంగుండా నేను ప్రవేశించడానికి ప్రయత్నించినట్లయితే నాయింటి నవుకర్లే నన్ను ఉరితీయించడానికి పంపిస్తారు. అందువల్ల నేను మరొకరి సహాయం ఉపయోగించుకోవాలని నిశ్చయించాను. అది ఎవరిసహాయం అంటే లాన్యన్ సహాయం - అతనిని నేను కలిసికొనడం ఎట్లా? అతనిని నేను ఒప్పించి పని చేయించుకొనేది ఎట్లా? నేను వీధులలో ఎవరికీ పట్టుబడకుండా తప్పించుకొని పోయినప్పటికీ, అతని సముఖానికి నేను వెళ్ళడం ఎట్లా? అతనికి అసహ్యకరంగా ఉండే పరాయి కొత్తమనిషినగు నేను, అతని సహచర వైద్యవిద్వాంసుడగు డాక్టరు జెకిల్ ఇంటి పఠనమందిరంలోనికి భేదించుకొని బలాత్కారంగా ప్రవేశించవలసినదిగా ఈ సుప్రసిద్ధ వైద్యశిఖామణిని నేనెల్లా ఒప్పించడం? నా పూర్వప్రకృతికి సంబంధించిన ఒక సామర్థ్యం మాత్రం నాకు మిగిలి ఉన్నదని నేను జ్ఞప్తికి తెచ్చుకున్నాను. నా అసలు పూర్వపు దస్తూరిలోనే ఇప్పుడుకూడా వ్రాయగలను; ఈ విషయం నాకు మెరుపు మెరిసినట్లుగా మనస్సుకు స్ఫురించేసరికి, నేను తయారుచేయవలసిన

# సంక్రాంతికి స్వాగతము

గోటేటి శ్రీరామారావు

వస్తోందదుగో బాలల్లారా!
సంక్రాంతిపండుగ వస్తోంది.
అక్కా-బావా, అన్నా వదినా
చుట్టాలంతా వస్తారు.
కలకలలాడే పండుగనాటికి
కిలకిలలాడుతు వస్తారు.

తెస్తారండీ తెస్తారూ
నాన్నా రెన్నో తెస్తారూ
అన్నకు బావకు ధోవతులూ
అక్కకు వదినకు చీరెల్లూ,
అమ్మకు, నాకూ, చెల్లాయిలకీ
కొత్తబట్టలను తెస్తారు,

భోగికి పిల్లలమందరమూ
బొగామంటలు వేస్తాము.
పండుగరోజున నిండుమనమ్మున
బొమ్మలకొలువులు పెడతామూ.
ఎంతానందము, ఎంతవినోదము,
సంక్రాంతదుగో సంక్రాంతి!

వ్యూహా పథకం అంతా, ఆమూలనుంచి యీమూలకు ఆమూలాగ్రంగా తేటతెల్లమయింది.

అంతట నాదుస్తులను నేను సాధ్యమైనంతవరకు సరిచేసికొని త్రోవలో పోతున్న ఒక కిరాయిబండీని పిలిచి అందులో ఎక్కి పోర్టులాండువీథిలోని ఒక హోటలుకు చేరాను. దానిపేరు నాకు జ్ఞాపకముండడం చేత అక్కడికి చేరాను. (నా వికృత ఆకారమును నా దుస్తులు ఎంతతీరుగా కప్పిపుచ్చినప్పటికీ) నా రూపం నా వేషం చూచేసరికి బండివాడు నవ్వు ఆపుకొనలేక పోయినాడు. నేను పిశాచావేశంతో వాడిమీద పళ్లుపట పట కొరికాను. అంతటితో అతని ముఖంలో ఆ మంద హాసంమాయమైపోయింది. అంతవరకు వాడు అదృష్ట వంతుడే. అంతకంటే అదృష్టవంతుణ్ని నేను-ఎందు చేత నంటే మరుక్షణంలో నేను వాణ్ని వాని పీఠంలోనుంచి క్రిందకు పడగొట్టి ఉండేవాణ్ని. హోటలుకు చేరిన పిమ్మట అక్కడఉన్న వాళ్లందరినీ నేను నా కొరివి ముఖంతో తేరిపార చూచేసరికి వాళ్లందరూ హడలిపోయినారు. నా ఎదుటమాత్రం వాళ్లల్లో వాళ్లు నన్నుచూచి కన్నుగీటుకోలేదు. కాని, విధిలేక చిత్తం చిత్తం అంటూ నేనుకోరిన ప్రకారంగా నాకొక ప్రయి వేటుగది చూపించారు. వ్రాసికొనుటకు కావలసిన పరి కరములు తెచ్చియిచ్చారు. అంతులేని ఆగ్రహావేశంతో మండిపడుతూ, చంపి హతమార్చేస్థాయిలో తాండవ మాడుతూ, పీడించి హింసించవలెననే దాహంతో ఉండేటటువంటివాడు హైడ్. కాని,తనప్రాణానికి తానే హడలిపోతున్న పిరికి హైడ్‌ను నే నిదివరకెన్నడూ ఎరుగను. అయినప్పటికీ ఆ జీవి చాలా నిగ్రహంతో ఉన్నాడు. తన ఆగ్రహావేశాన్ని స్వసంకల్పబలంతో అణచివేశాడు. రెండు ముఖ్యమైన ఉత్తరాలను ఒకటి లాన్యనుకూ, రెండవది పూల్‌కూ వ్రాశాడు. ఆ రెండు ఉత్తరములూ పోస్టులో వేయబడినవని తనకు రూఢిగా తెలిసే నిమిత్తమై వీటిని రిజిస్టర్డుపోస్టుద్వారా పంపవలసి యున్నదని ఉత్తరువుచేశాడు.

అటుపిమ్మట రోజంతా, ఆ ప్రయివేటు గది లోనే నెగడువద్ద తనగోళ్లు కొరుక్కుంటూ కూర్చు న్నాడు. అక్కడే తన గుండె దిగులుతో ఏకాంతంగా కూర్చొండి భోజనం చేశాడు. ఎదురుగుండా ఉన్న నవుకరు వణికిపోతూనే ఉన్నాడు. అటుపిమ్మట రాత్రి బాగా చీకటిపడిన తర్వాత, నలువైపుల తలు పులు మూసిన బండీలో ఒకమూలగా కూర్చున్నాడు. నగరవీథులలో అటుయిటు అడ్డదిడ్డంగా అతనిబండీ నడచింది. "అతడు" అనే మాటనే వాడగలను. "నేను" అనేమాట నేను వాడలేను. యమలోకంలో నుంచి ఊడిపడినటువంటి ఆవ్యక్తికి మానవత్వం అనేది ఏమీలేదు. వానిలో మూర్తీభవించినది ఏమిటంటే అమితభయం; అందరిమీదా అసహ్యం ద్వేషం- చిట్ట చివరకు, బండీవానికి తనమీద అనుమానం కలుగు తున్నట్లుగా తోచి ఆబండీని విడిచిపెట్టి, తన జీరాడు వ్రేలాడు మితిమించిన భారీదుస్తులతో, పదిమందినీ ఆకర్షించే ఆకారస్వరూపంతో, రాత్రిసమయ వీథి పాదచారుల మధ్యలోనుంచి వెళ్లిపోయినాడు. అమిత భయం, అందరిమీదా అసహ్యం అతనిలో తుపాను వలె ప్రచండంగా చెలరేగుతున్నాయి. తొందర తొందరగా నడిచాడు. అతని భయములు అతన్ని వేటాడినట్లు వెంటాడుతున్నాయి. తనలో తాను గొణుగుకుంటున్నాడు. జనసమ్మర్దం తక్కువగా ఉన్న రస్తాలమీదుగా నక్కి నక్కి నడుస్తూ, నడిరాత్రివేళ యగుట కింకా ఎన్నినిమిషాలున్నాయో లెక్కపెట్టు కుంటూ వెళ్లాడు. త్రోవలో ఒక అమ్మి అతనిని పలుకరించింది. అతనికి చిరుతిండి దినుసుల పెట్టె నొకటి ఈ అమ్మి అమ్మచూపింది. ఆమె దవడమీద అతడొకటి వేసేసరికి ఆమె దవుడు తీసింది.

లాన్యనుయింటికి నేనుచేరి అక్కడ నా స్వస్వ రూపం పొందినతర్వాత, నా ప్రాతమిత్రునకు అప్పుడు కలిగిన ప్రళయభీతి నామీద ఒకవేళ కొంత పనిచేసిన దేమో నాకు బాగా తెలియదు. కాని, ఆనాటిరాత్రి ఆకొలది గంటలసేపు నడచిన కథాకలాపం అంతా నేను తలచుకున్నందువల్ల నాకు కలిగిన అమితమైన రోతలో అమితమైన వెగటులో, నామిత్రుని కంగారు వల్ల నాకు కలిగినబాధ సముద్రంలో కాకిరెట్టవంటిది. నాలో ఒకమార్పు వచ్చింది. నేను పట్టుబడితే నన్ను ఉరితీస్తారనే భయంకాదు యిప్పుడు నన్ను బాధించేది. అప్రయత్నంగా హఠాత్తుగా హైడ్‌గా మారిపోతా నేమో అనేభయం యిప్పుడు నన్ను బాధిస్తోంది. నన్ను నిందిస్తూ లాన్యను చేసిన బోధఅంతా అప్పుడు విన్నానుగాని అదంతా నాకు స్వప్నలీలగా స్మరణకు

# ★ మనిషిలో మనిషి ★

వస్తోంది. నేను ఒక విధమైన స్వప్నావస్థలో నే అక్కడినుంచి నా యింటికివచ్చి పరుపుమీద పడుకున్నాను. క్రిందటి రోజంతా నేను అమితమైన అలసట పడుటచేత ఆనిస్త్రాణవల్ల నాకు బండనిద్ర పట్టింది. రాత్రిళ్లు నాకు కలిగేటటువంటిగుండె ఉలుకులుకూడా ఆనాటిరాత్రి నాకు నిద్రాభంగం చేయలేనంత బండనిద్ర పట్టింది. మరునాడుదయం నేను నిద్రలేచేసరికి చాలా నీరసంగా, దివాలా తీసినట్లుగా ఉన్నాను. కాని, విశ్రాంతిపొంది అలసట తీరినట్లుగా ఉన్నాను. నాలో అంతర్గతంగా మాటుమణగి నిద్రాణంగా ఉన్న మృగతత్వమును తలుచుకుంటే నాకు భయం పుట్టుతోంది. క్రిందటి రోజున నేను ఎటువంటి ప్రమాదావస్థలపాలైనదీ ఎంతమాత్రమూ మరచిపోలేదు. కాని, తిరిగీ నాస్వగృహానికి నేను చేరుకొన్నాను. నాఔషధాలన్నీ నాదగ్గరనే ఉన్నాయి. నాకొక గండం తప్పినందుకు మహత్తమమైన కృతజ్ఞతానందం నా ముఖారవిందంలో ప్రకాశించింది. మున్ముందు బాగుపడ్డాననే ఆశోల్లాసంకంటె ఆ కృతజ్ఞతానందమే నాఅంతరాత్మలో అధికతరంగా ప్రకాశించినదని చెప్పవచ్చు.

ప్రాతఃకాల భోజనంచేసి నా యింటి పెరటిజాగాలో విశ్రాంతిగా తిరుగుతున్నాను. చలిచలిగా ఉన్నగాలినే సరదాగా అనుభవిస్తున్నాను. ఆసమయంలో, నాకు రూపపరివర్తనాత్పూర్వం సంభవించే అనిర్వచనీయ పైత్యవికార లక్షణములన్నీ ప్రారంభమైనాయి. నేను తిరిగీ హైడ్ తత్వంలోకి మారిపోయి వాని ఉగ్ర ఉద్రేకములన్నీ నాకు పూనకపూర్వమే, నా కచ్చేరిగదిలోకి నేను చేరుకొనుటకు కావలసినంత స్వల్ప వ్యవధిమాత్రం ఉంది. నాకు స్వస్వరూపం తిరిగి రావడానికి యీసారి నేను రెండింతలు మోతాదుగా మందు పుచ్చుకోవలసి వచ్చింది. కాని, హారహారా! ఆరుగంటలు గడచినతోడనే, నేనేదో దిగులుగా నెగడు వద్ద కూర్చున్నసమయంలో, నాకు రూపాంతర ప్రసవవేదన మళ్ళీ ప్రారంభమైంది. మందును మళ్లీ సేవించవలసివచ్చింది. ఇంకెందుకు? ఆనాటినుంచి నేను ప్రాణాలు బిగబట్టినట్లుగా కసరత్తు చేస్తూ, నా మందును ఎప్పటికప్పుడు సేవిస్తూ ఉండడంవల్లనే నా జెకిల్ రూపమును నేను నిలువబెట్టుకోగలిగినాను. హైడ్‌గా మారిపోతున్నానేమోననేభయం అహోరాత్రాలూ అనుక్షణమూ నన్ను వెంటాడుతూనే ఉంది. అన్నింటికంటె పెద్ద విశేషం ఏమిటంటే, నేను నిద్రపోయినాసరే, రవ్వంత సేపు కునికిపాట్లుపడి లేచినాసరే, మెలకువరాగానే హైడ్ రూపంలో ఉండేవాడిని. నా మనస్సునొక పీడ నా నీడవలె వెంటాడుతూ ఉండడంవల్ల, నిద్రపోవుట కూడా మానివేశాను. మానవమాత్రుడైనవాడెంత వరకు నిద్రను వర్జించగలడో అంతవరకూ వర్జించాను. యీ గుండెదడతో, యీ భయవిరహతాప జ్వరంతో నాలో నేను కృశించి జీర్ణించిపోతున్నాను. శరీరం, మనస్సు కూడా బేజారై దిగజారిపోతున్నాయి. నా రెండో అవతారమే నా పెనుభూతమై నన్ను భయపెట్తోంది. నేను నిద్రపోయి లేచినప్పుడుగాని, నేను త్రాగిన మందు ధాటీపోయినతర్వాతగాని, నేను లేచీ లేవడంతోనే ఒకపూనకం వచ్చినట్లుగా లేస్తాను. (నా రూపాంతర ప్రసవవేదన పూర్వమువలె తీవ్రంగా రాకుండా రోజురోజుకూ తగ్గిపోతోంది.) నేను లేవగానే, నా మెదడులో భీకరభీభత్స వీరావేశభావములు చిందులు త్రొక్కుతూ ఉంటాయి. లోకంయెడల కారణం ప్రేరణంలేని అసహ్యద్వేషధోరణి పుట్టుకొని వస్తుంది. కాని నా శరీరం ఈ ఉగ్రావేశములకు తాళుకొనలేని నీరసస్థితిలో ఉంటున్నది. జెకిల్ శరీరం జబ్బుశరీరం అయినకొలదీ, హైడ్ తత్వ ప్రభావం ప్రబలమవుతోంది. వీరిద్దరికీ ఒకరియెడల యింకొకరికి ద్వేషం ఉభయత్ర సమానమైపోతోంది. హైడ్‌యందు ఎటువంటి వైకల్యం ఎటువంటి వంకరటింకరతత్వంఉన్నదో జెకిల్ బాగా గ్రహించాడు. కాని, ఆత్మపరివర్తన విషయములో ఉభయులకూ సమష్టి భాగస్వామ్యంఉంది. తనతోపాటుఅతడుకూడా ఆమరణం ఆస్తికి అధికారి. ఈ రెండు సమష్టిలక్షణములు తప్ప, వేరేవిధమైన లంకె యిద్దరికీ లేదు. కాని, యీలంకెయే అతని మనోవేదనకు ముఖ్యకారణమైపోయింది. హైడ్ అనేవాడు రాక్షసిఅనిన్నీ, చైతన్య శూన్యుడనిన్నీ, జెకిల్ తన యావజ్జీవిత సంకల్పాసక్తిశక్తితో పరిగణించి భావించాడు. అన్నింటికన్నా చిత్రమేమిటంటే, ఈ

ఘటంలో అధమస్థమై పడియుండవలసిన పనికిరాని మురికి పైకి యికిలించి సకిలించి గీపెట్టి కూతలుకూయుచున్నట్లుగా ఉంది. నామరూపాలు లేని ఈ మట్టి యీ ఘటంలో నుంచి సైగలు చేసి సైతాను చేష్టలు చేస్తోంది. అంతరించి ఆకారవిచ్ఛిత్తయి, విచ్చి చచ్చిన కొరివి ఒక జీవిని నెట్టి తన పీఠం అక్కడ పెట్టుకోవలె నని ప్రయత్నిస్తోంది. ఇదే అత్యంత ఘోర దురంతం. ఆ ఘోరపిశాచి, అతనిలోని ఆ జేజమ్మ, అతని అర్ధాంగికంటె అత్యంత సన్నిహిత సాహచర్యంతో వర్తిస్తోంది. కంటికి రెప్పవలె కనిపెట్టి విడువకుండా ఉంది. అతని అస్థిపంజరంలో, అది దాగి ఉంది. దాని గొణుగుడు, దాని సణుగుడు అంతా అతనికి వినబడుతోంది. అది పైకి నిజస్వరూపంతో ఆవిర్భవించవలెనని తన్నుకొనుచున్నదని స్పష్టంగా కన్పిస్తోంది. ఏమాత్రం ఏమరియున్నప్పటికీ, ఏమాత్రం దుర్బలంగా ఉన్నప్పటికీ, నిశ్చింతగా నిద్రపోవుటకై కన్ను మూసినప్పటికీ, అతనిని వశం చేసికొని, అతనిని అంత మొందించి తన పీఠం ఏర్పరచుకుంటూ ఉన్నది. జెకిల్ యెడల హైడ్‌కు ఉన్నటువంటి ద్వేషం మరొకవిధమైనది. తనకు ఉరిశిక్ష పడుతుందనే భయంచేత హైడ్ తన రూపం తానే హతం చేసికొని జెకిల్‌లో ఒక భాగస్థుడై తల దాచుకుంటున్నాడు. పూర్తిగా తానొక ప్రత్యేక సంపూర్ణ స్వతంత్రవ్యక్తిగా ఉండక, మరొక వ్యక్తిలో భాగస్థుడై ఉంటున్నాడు. కాని యీ శరణ్యం అనివార్యం కావడమే అతనికి అసహ్యంగా ఉంది. జెకిల్ యిప్పుడు దిగులుపడిఉండడంవల్ల, జెకిల్ విషాదకారణం హైడ్‌కు విద్వేషకారణం అయింది. తనయెడల జెకిల్‌కు రోత పుట్టడం చూస్తే, హైడ్‌కు కడుపుమంటగా ఉంది. అందువల్ల నాలోఉన్న హైడ్ కొంటె కోతి చేష్టలు చేస్తున్నాడు. నా గ్రంథాలమీద నా చేతితోనే అనేక భగవద్దూషణ వాక్యాలు వ్రాయిస్తాడు. ఉత్తరాలు నాచేత తగులబెట్టిస్తాడు. నాతండ్రి పటమును నాచేత ధ్వంసం చేయించాడు. వానికి చావంటే భయం లేకపోయినట్లయితే, తనతోబాటు నన్ను కూడా అంత మొందించుటకై అతడెన్నడో ఆత్మనాశనం చేసికొనేవాడే. కాని, అతనికి అతని బ్రతుకుమీదఉన్న ప్రేమ అద్భుతమైనది. అంతేకాదు. మరింత

**సవరణ**

25-11-53- ఆంధ్రవారపత్రిక- 31 పుట- 1వ కాలం - "మనిషిలో మనిషి"- 2వ పంక్తిలో:- "డాక్టరులాన్యను తనతాలూకు" అని ఉంది. "డాక్టరు జెకిల్ తనతాలూకు" అని ఉండాలి.

విస్తరించి వివరిస్తాను. వాడిపేరు చెప్పితేనే నాకు ఒళ్లు జల్లుమంటుంది. కాని, అతనికీ నాకూ ఉన్న గాఢ మమకారమున్నూ, దాసోహం అన్నంత వ్యామోహమున్నూ తలచుకొన్నప్పుడు, నా ఆత్మహత్య మూలంగా అతనినికూడా అంతరింపజేయగల శక్తి నాకున్నదని తలచుకొన్నప్పుడు, ఎందుచేతనో అతని మీద నా ఎదలో దయపుట్టుకొని వస్తుంది.

ఇదంతా వృథా గాథ. ఈ వర్ణన యింకా పెంచి వ్రాయడానికి కాలవ్యవధి లేదు. ఇటువంటి దారుణవేదనలు యిదివర కేమానవుడూ అనుభవించలేదు. ఈ ఒక్క విషయం చెప్పితే చాలు. ఈ యమబాధలకు నేను అలవాటుపడినంత మాత్రంచేత, నా బాధ ఏమీ ఉపశమించలేదు. కాని, నా అంతరాత్మ బండవారిపోయింది. నిస్పృహచేత తలయొగ్గినట్లయింది. నాకు యీ యమదండన ఆవేదన యింకా కొన్ని సంవత్సరాలవరకూ సాగుతూఉండేదే. కాని, యిప్పుడు నాకు సంభవించిన ఆపత్తుమూలంగా, నేనూ, నాస్వరూపస్వభావములూ నిర్మూలింపబడినవి. నేను నా ఔషధ పరిశోధన ప్రయోగమును మొట్టమొదట చేసినప్పుడు కొంత క్షారమును భారీగా తెప్పించినాను. అటు తర్వాత ఆ క్షారమును ఎప్పుడూ తెప్పించలేదు. మొదట తెప్పించిన క్షారం క్రమేణ అయిపోతోంది. క్రొత్తగా మరికొంత క్షారం తెప్పించి ఔషధం తయారు చేసినాను. బుసబుసమని పొంగింది. మొదటి రంగు మార్పు వచ్చింది. కాని రెండో రంగుమార్పు కన్పించలేదు. ఆ మందును త్రాగితిని. కాని, అది పనిచేయలేదు. లండను నగరంఅంతా వెతకించి సోడా చేయించాను. ఈ విషయం మీకు పూల్ ద్వారా తెలియగలదు. ఎంత వెతికించినా, ప్రయోజనం లేకపోయింది. నాకు మొట్టమొదట లభించిన క్షారంలో కొంత కల్తీ ఉంది. నాకు తెలియని ఆ కల్తీపదార్థం అందులో చేరి ఉండుటమూలంగానే నామందు ఇదివరలో అమోఘంగా గుణమిచ్చిందని నే నిప్పుడు గ్రహించాను.

# ★ మనిషిలో మనిషి ★

ఒక వారంరోజులు గడిచాయి. ప్రాతపూరంతో చేసిన మందును త్రాగి దాని గుణప్రభావంవల్ల నేను యీ వాఙ్మూలం పూర్తి చేస్తున్నాను. ఇదే ఆఖరు పర్యాయంగా హెన్రీ జెకిల్ తన సహజభావాలతో యోచించగల్గుతున్నాడు. తన సహజ ముఖవైఖరిని (బహు విషాదకరంగా మారిన రూపును) అద్దంలో చూచుకోగల్గినాడు. ఇంతకన్న మహాత్కార్యం మరొకటి లేదు. ఇక నా వ్రాతను నేను కాలయాపన చేయక త్వరగా ముగించాలి. నా నిజకథానివేదిక యింతవరకూ ధ్వంసం చేయబడక తప్పించుకొన్నదంటే, అది అంతా అతిజాగరూకతవల్లనూ, అదృష్టవశమువల్లనూ సాధ్యమైంది. దానిని వ్రాస్తూ వ్రాస్తూ ఉండగానే, నారూపపరివర్తనా వేదన ప్రారంభమైనట్లయితే, హైడ్ ప్రత్యక్షమై, యీ కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చించి పారవేస్తాడు. దీనిని వ్రాసి దాచివేసినపిమ్మట కొంతకాలం గడచినట్లయితే, అతనికి సద్యకాలావసరస్వప్రయోజనమే స్వతస్సిద్ధలక్షణమగుటచేత యీ కాగితము బహుశః అతని మర్కటసదృశవిద్వేషమున కాహుతికాకుండా సురక్షితమై ఉండవచ్చు. అదిన్నీగాక, మా ఇద్దరి అంత్యదశ సమీపిస్తోంది. సమీపిస్తున్న యీ యమగండం అతనిని యీవరకే చాలా మార్చి పరిమార్చినది. ఇంకో అరగంటలో నేను సదా శాశ్వతంగా ఆ దుస్సహ అసహ్య ఆకారంలో అవతరింపబోవుచున్నాను. అప్పుడు నా కుర్చీలో నేను గజగజలాడుతూ, వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చోవాలి. లేదా, (నాకు యీ దురవస్థలో మిగిలిన కట్టకడపటి శరణ్యమైన) యీ గదిలో ఒళ్లు తెలియని భీతితో, నాకేమి పుట్టి మునుగనున్నదో యని వెరచి, ఎక్కడ ఏ శబ్దమైనా చెవులు నిక్కించి, అటు యిటు చరలాడుతూ ఉండాలి.

హైడ్ ఉరికంబాన ఉసురులు వీడునా? ఆఖరు క్షణములో అతని కతడే ఆత్మవిమోచన కల్పించుకొనగలుగు తెగువ యతనికి కలుగునా? ఈశ్వరునకే ఎరుక! ఇక ఏది ఎట్లాగైనా, నాకేమీ లక్ష్యం లేదు. ఇది నిశ్చయంగా నా మృత్యుఘడియ. ఇకమీదట జరిగేది అంతా, ఇతరులకు సంబంధించిన విషయమే గాని నాకు కాదు. ఇక నా నిజకథానివేదికకు సీలు ముద్ర వేస్తున్నాను. హెన్రీ జెకిల్ అనెడి అభాగ్యుని జీవితకలాపం సమాప్తం చేస్తున్నాను.

సమాప్తం

# ★ అసమర్థులు ★

(15-వ పేజీ తరువాయి)

మొఖం చూతుర్ని పెళ్లిచేసుకోమని రోజూ నన్ను వేధిస్తున్నాడు.

కమ: అదేమిట్రా అలా అంటావ్! అది మేనరికం! నువ్వు చేసుకోవడం ఎలాగూ తప్పదు.

జోగా: ప్రపంచం తల్లక్రిందులైనా నేను మామయ్యకూతుర్ని మాత్రం పెళ్ళి చేసుకోను.

కమ: కొంపతీసి యీమాట మామయ్య ముఖంమీద అనలేదుకదా!

జోగా: నాకు భయమేమిటమ్మా! ఎక్కడైనా అంటాను. - తను నా మర్యాద కాపాడనప్పుడు నేనుమాత్రం అతని గౌరవాన్ని ఎందుకు కాపాడాలి? పైగా తను నాకు పెద్ద ఉద్యోగం యిప్పించాడని - నాకు కొంచెంకూడా విశ్వాసంలేదని పదిమందిదగ్గరా అనడం ప్రారంభించాడు.

కమ: కేశవరావు మనకు కావలిసినవాడు పెద్దవాడూను. అతను తొందరపడినా నువ్వు తొందరపడకూడదు.

జోగా: నేను బి. ఏ. చదివాను. ప్రపంచాన్ని - పరిస్థితుల్ని చూస్తో చూస్తో అర్థం చేసుకున్నాను. నా స్వవిషయంలో మంచి చెడ్డల్ని నిర్ణయించుకొనే స్వాతంత్ర్యం నాకువుంది - ఆత్మాభిమానం వదులుకోవడమూ ఉద్యోగం వదులుకోవడమా అని రాత్రంతా ఆలోచించి - ఉదయం ఉద్యోగం వదిలేసి రైలెక్కాను.

కృష్ణ: (సంతోషంతో) సెహబాష్! మన గౌరవాన్ని యింత అమోఘంగా కాపాడతావని నే నెన్నడూ అనుకోలేదు.

కమ, చిట్టి: (ఆశ్చర్యంతో) ఉద్యోగం వదిలేశావా?

కృష్ణ: (జోగారావు భుజంమీద చెయ్యి వేసి) నువ్వింత అమోఘమైన త్యాగం చేసినందుకు నీకు టీపార్టీ యిస్తాను. రా! హోటలుకు పోదాం.

(యిద్దరూ భుజాలమీద చేతులు వేసుకొని సంతోషంతో వడివడిగా వెళ్లిపోతారు.)

కమ: ఈ యింటిలో వాళ్లందర్నీ పట్టి పనికిమాలిన వాళ్లను చేసేవేమిరా భగవంతుడా!

(చిట్టి, తల్లి ముఖంలోకి విషాదంగా చూస్తూ వుంటుంది. —తెర.—) ★

(37 వ పేజీ తరువాయి)

వినిపించాయ్. "నీ మెళ్లోవి ఇస్తావా, మమ్మల్ని లాక్కోమంటావా?"

"నేను ఇవ్వను" అంటోంది తల్లి.

"ఊ! ఇవ్వవూ?" అంటూ గర్జిస్తున్నాడు దొంగ.

లక్ష్మికి భయం ఎక్కువయింది. దొంగలనుగురించి చాలా సార్లు విన్నది. ఇప్పుడు తనఇంటికి వచ్చిన వాళ్లు 'తప్పకుండా దొంగలే! లేకపోతే వాళ్లు అంత హుంకరించి అడగరు. తల్లి అపాయకరపరిస్థితిలో ఉన్నట్టు అప్పటికి లక్ష్మికి బోధపడింది. తను అలా పడుకునుంటే లాభంలేదు. 'ధైర్యే సాహసే లక్ష్మీః' అన్న తండ్రి మాటలు గుర్తుకొచ్చాయి. నిశ్శబ్దంగా లేచింది పక్కమీదినుంచి.

"దూరంగావుండు నేనేఇస్తాను" అంది తల్లి. మెళ్లోవున్న సొమ్ములు ఇచ్చింది. లక్ష్మి గోడచాటున వుండి చూస్తున్నది.

"ఇనపపెట్టెతాళాలు ఎక్కడున్నాయ్?"

తల్లి మాట్లాడలేదు.

"కదిలావా కాలుస్తాను! చెప్పు ఎక్కడున్నాయో?" అంటున్నాడు దొంగ.

"ఏమో! నాకు తెలీదు."

ఇంతలో రెండోవాడు "ఇదుగోరా బీరువాలో ఉన్నాయ్!" అంటూ తాళాలుతీసి చూపించాడు.

"నేను ఈమెదగ్గరుంటాను నువ్వుపోయి ఇనప్పెట్టెని తెరు" అన్నాడొకడు.

లక్ష్మికి ఏంచెయ్యాలో తోచలేదు. కొద్దిసేపు వుంటే వస్తువులు అన్నీ పోవడమేగాక తల్లికికూడ విపత్తు సంభవించేలాగుంది. బయటకుపోవటానికి వీలులేదు. ఎలాగో?

ఇంతలో మెరుపులామెరసింది ఓ ఆలోచన! ధైర్యం తెచ్చుకుంది. వాళ్లు చూడకుండా పక్కకిటికీదగ్గరకు వెళ్లి, "ఒరేయ్ వెంకడూ, ఓరేయ్ వీరడూ దొంగలు ఆఫీసుగదిలో వున్నారు. అమ్మను మాట్లాడనివ్వటంలేదు. ఒకరు అటూ, ఒకరు ఇటూ రండి. దొంగలిద్దరూ చిక్కిపోతారు. త్వరగారండి" అని బిగ్గరగా అరిచేసింది.

ఈమాటలు వినేసరికి దొంగలిద్దరికీ తారెత్తింది. ఇద్దరూ హడలిపోయారు. 'చిక్కాంరా బాబూ' అనుకుంటూ ఎక్కడిసొమ్ములు అక్కడే వదిలేసి పలాయనం చిత్తగించారు.

తనప్లాను పనిచేసిందాలేదా అని, లక్ష్మి తొంగిచూసింది ఆఫీసుగదిలోకి. అప్పటికే అటువైపు తలుపు తెరుచుకుని జండా ఎత్తేశారు దొంగలు.

"ఎంతమంచిపనిచేశావే! చిన్నబిడ్డవయినా!" సమయానికి ఆదుకున్నావు, అంది సత్యవతమ్మ చేతులకు కట్టివున్న తాళ్లు విప్పుకుంటూ.

నిజానికి ఆ ఇంట్లో వాళ్లిద్దరు తప్ప మరో నరమానవుడు లేడు. ఎవరో ఉన్నట్టుగా, లక్ష్మి ఆర్డరు జారీచేసేసరికి నౌకర్లు నిజంగా వస్తున్నట్లుభయపడి పారిపోయారు దొంగలు!

సత్యవతమ్మ కూతుర్ని ముద్దాడి, ఆరాత్రి పక్కింటి పార్వతమ్మగార్ని తోడు తెచ్చుకుని గడిపింది.

మరునాడు సుందరయ్య వచ్చాడు వూరినుంచి. వాకిట్లోనే ఎదురుపడి, "మన లక్ష్మి లేకుంటే ఈపాటికి ఏమయ్యేవాళ్లమో?" అంది సత్యవతమ్మ.

"ఏం? ఏంజరిగింది?" అని అడిగాడు సుందరయ్య గాభరాగా.

జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పింది సత్యవతమ్మ.

"చిన్నదైనా నాకన్నా అదే ధైర్యంచూపింది లక్ష్మి!" అందితల్లి.

"'ధైర్యే సాహసే లక్ష్మీః' నాతల్లి ఎపుడూ ధైర్యవంతురాలే! బహుమానంగా రేపు కొత్తడ్రస్ కొంటాను" అన్నాడు సుందరయ్య.

లక్ష్మి ఆనందానికి అంతులేదు.



"మీకు మోటారు ప్రమాదం జరిగి రెండు నెలలు దాటాయి కదా. ఇంకా ఆచేతికర్ర ఎందుకండీ ... వెళ్ళి డాక్టర్ గార్ని అడగకూడదుటండీ - చేతిలో ఆకర్ర లేకుండా నడవవచ్చా అని"?

"ఇంకొక నెలరోజులు ఇలాగే నడవాలని వకీలుగారంటూన్నారే!"

—జి. వి. జి. కృష్ణ, మద్రాసు.



రూప్ కె. శోరీ నిర్మించిన "ఆగ్ కా దర్యా" హిందీ చిత్రంలో మీనా.



"స్వయంవరం దండ మెడలో వేయించుకోండి" అంటున్నది చిన్ని
విజయావారి "చంద్రహారం"లో ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, పుష్పలత.

# "చంద్రహారం"

విజయావారి "చంద్రహారం" 6 వ తేదీన విడుదలవుతున్నది. సుమారు మూడేళ్లపాటు నిర్మాణంలో వుండి, పాతికలక్షల రూ. ల వ్యయంతో యీ చిత్రం వెలువడింది. చాల రోజులనుంచి ప్రేక్షకులు దీనికోసం ఎదురుచూస్తున్నారనడం అతిశయోక్తి కాదేమో. ప్రేక్షకుల కిది ఆశాభంగం కలిగించదనే మా నమ్మకం. ఈ చిత్రం నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి; దర్శకుడు కె. కామేశ్వరరావు; పర్యవేక్షణ ప్రసాద్; కథ, మాటలు, పాటలు పింగళి; సంగీతం ఘంటసాల; కళ గోఖలే, కళాధర్; ఫొటోగ్రఫీ మార్కస్ బార్ట్లే; సౌండు కృష్ణయ్యర్.

చందనరాజ్యానికి చంద్రచూడుడనే రాజు (శ్రీవత్స) ఉన్నాడు. ఆయనకి లేక లేక చంద్రదేవుని వరప్రసాద ఫలితంగా చందనరాజు పుట్టాడు. చందనరాజు మెడలో చంద్రహారంతో పుట్టాడు. రాజగురువు వచ్చి, చందనరాజు ప్రాణం చంద్రహారంలో వున్నదనీ, ఆ చంద్రహారం పోతే అతని ప్రాణం పోయినట్లేననీ, కాని మానవులెవ్వరూ హారం తాకలేరనీ చెబుతాడు. యౌవనంలో అతని కొక గండం వుందనీ, వివాహంచేస్తే సతీమాంగల్య ప్రభావంవల్ల ఆ గండం తొలగుతుందనీ కూడా చెబుతాడు. రాజుగారికి పుత్రసంతతి లేనందువల్ల తనకే రాజ్యం సంక్రమిస్తుందని ఆశపడిన రాజజామాత ధూమకేతువు (రేలంగి)కు చందనరాజు జననం కంటకప్రాయమవుతుంది. చందనరాజు మాలి (రంగారావు) అనే ఆయన శిక్షణలో విద్యాబుద్ధులు నేరుస్తూ పెరిగి పెద్దవాడవుతాడు. పెద్దవాడయిన చందనరాజు (రామారావు) ఊహాసుందరి నొకామెను చిత్రించుకొని, అటువంటి కన్యను తప్ప మరెవరినీ వరించనని భీష్మించుతాడు. అతనికి వివాహమయితేగాని ప్రాణగండం తొలగదని తెలిసిన రాజుగారు "సరే, నీ యిష్టంవచ్చిన పిల్లనే చేసుకో. పోయి దేశాలన్నీ చూసి ఆ పిల్లను అన్వేషించు," అని మాలిని తోడిచ్చి కుమారుణ్ణి దేశాటనానికి పంపిస్తాడు.

ధూమకేతువు ఎలాగైనా చందనరాజును అంతంచేసి తన మార్గం నిష్కంటకం చేసుకోవాలనే ఆలోచనలో వున్నాడు. అతనికి సలహాదారుగా "ఎక్కడినుంచి వచ్చాడో, ఎక్కడికి పోతున్నాడో తెలియని నిక్షేపరాయుడు (జోగారావు) కుదురుకుంటాడు.

ఇతగాడు ధూమకేతువుకు భరవసాయిస్తాడు: 'నేను చందనరాజుకు ఆడదంటే మొహం మొత్తేట్టు చేస్తా'నంటాడు. దేశాటనం బయలుదేరిన చందనరాజుకు తెలియకుండా నిక్షేపరాయుడుకూడా వెనక వెడతాడు.

చందనరాజు ఊహాపథంలో దర్శించిన సుందరి నిజంగా ఒక ఊళ్లో వున్నది. ఆమె పేరు గౌరి (శ్రీరంజని). గౌరికి సవతితల్లి (ఋష్యేంద్రమణి) పెద్ద శత్రువు. నిక్షేపరాయుడు గౌరి సవతి తల్లిని బుట్టలో వేసుకుని ఆమె స్వంతకూతురును చందనరాజు తప్పక వరిస్తాడని చెబుతాడు. కన్యాన్వేషణ యాత్రలో ఆ వూరువచ్చిన చందనరాజు తన్ను వరించమంటూ యెదురువచ్చిన గౌరిసవతి చెల్లెలును చూసి ఏవగించుకుంటాడు. తన ఊహాసుందరి గౌరి ఆ వూళ్లోనే వుందని తెలియక దేశాటనం మానుకుని యింటికి తిరిగిపోతాడు.

చందనమహల్లో వొంటరిగా ప్రేమగీతం పాడుతున్న చందనరాజును చంచల (సావిత్రి) చూస్తుంది. అతని దీక్షవిషయం, ప్రాణగండం విషయం ఆమె తన అక్క ద్వారా తెలుసుకుంటుంది. చందనరాజు దీక్షను భగ్నం చేస్తాననీ, అతడు తన్ను వలచేట్లు చేస్తాననీ శపథం పలికి చంచల భూమికి దిగుతుంది. కాని చందనరాజు చంచలను తిరస్కరిస్తాడు. ఆమె కుపితురాలై, చంద్రహారం సంగ్రహించి దేవలోకానికి వెళ్ళిపోతుంది. చందనరాజు చావూ బ్రతుకూ కాని స్థితిలో పడిపోతాడు. అతడు చనిపోయాడని అంతా దుఃఖిస్తారు. రాజుగారుమాత్రం 'చంద్రహారం ఎలా పోయిందో అలాగే వస్తుం' దనే నమ్మకముతో చందన రాజు శవాన్ని జాగ్రత్తగా కాపాడమని మాలిని నియోగిస్తాడు.

అక్కడ గౌరి సవతితల్లి పన్నిన వల నుండి తప్పించుకోనడానికని యిల్లు విడిచి అరణ్యమార్గం పట్టుతుంది. మార్గాయాసఖిన్నయై మూర్ఛిల్లుతుంది. ఆమె అవస్థ చూసి చంచల అక్క ఆమెను చందన మహల్ కు చేరుస్తుంది. చందన మహల్ లో మేల్కొన్న గౌరి తనక్కడికెలా వచ్చిందీ తెలియక కంగారుపడి, మంచం మీద పడివున్న చందనరాజును చూస్తుంది. చందరాజుకు ప్రతిరాత్రీ రెండు గడియల సేపు ప్రాణం తిరిగి వస్తుందని చంచల యిచ్చిన మాటప్రకారం, అత డారాత్రి లేస్తాడు. గౌరిని చూసి తన ఊహా సుందరి ప్రత్యక్షమైనందుకు సంతోషిస్తాడు. ఆ రాత్రే మాలి గౌరీ చందనరాజులకు వివాహం చేస్తాడు. వీరిద్దరి సుఖం చూసి సహించలేక చంచల చందనరాజును మహల్ దాటి ఇవతలకువస్తే శాశ్వతంగా చనిపోతావని శపిస్తుంది.

అక్కడ ధూమకేతువు తన కన్నాళ్ళకూ పట్టాభిషేకం జరిగే యోగం పట్టకపోవడం చూసి, అంతరంగికమంత్రి నిక్షేపరాయుడు మీద విరుచుకుపడతాడు. నిక్షేపరాయుడు ఒక ఎత్తు చెబుతాడు: 'సన్యాసం పుచ్చుకుంటా నని రాజుగారి వద్ద బెదిరించ' మని. ధూమకేతువు అలాగే చేస్తాడు. రాజుగారు 'నా ఒక్క కొడుకూ మృతుడైనాడు. అల్లుడివి నీవైనా నా దగ్గిరలేకపోతే ఎలా'గంటాడు. నిక్షేపరాయుడు 'ధూమకేతువుకు పట్టాభిషేకం చేస్తే ఇక్కడే వుండిపోతా' డని సలహా యిస్తాడు. రాజుగారు సరేనంటాడు. ధూమకేతువు చందనరాజు కళేబరాన్నికూడా తన మార్గంనుంచి తొలగించుకోవాలని భావిస్తాడు. మాలి అడ్డంరాకుండా అతన్ని సేవకులచేత కొట్టిపడవేయిస్తాడు. ఆ రాత్రి ధూమకేతువు, నిక్షేపరాయుడు చూస్తూండగానే చందనరాజు సజీవుడై లేచి మాలిని, గౌరిని వెదుక్కుంటూ చందనమహల్ దాటి వెడతాడు. వెంటనే చంచల అతని ప్రాణం అపహరించి వెళ్ళిపోతుంది. గౌరి చందనరాజు శవంపై పడి ఏడుస్తూంటుంది. చందనరాజును అనుసరించి వచ్చిన ధూమకేతువు వగైరాలు వీరిద్దరినీ చూసి, యిద్దరినీ హత మార్చాలనుకుంటారు. గౌరిని రాక్షసి అని ధూమకేతువు ఆరోపించి 'నిన్నూ, నీవల్ల ప్రాణం కోల్పోయిన చందనరాజునూ ఒకే సారి తగలపెడతా'o' అని చెబుతాడు. 'నేను రాక్షసిని కాను, చందనరాజు భార్యను' అని ఆమె చెబుతుంది. 'అయితే మరీ మంచిది' అని ధూమకేతువు అనుకుంటాడు. చితి పేర్చడానికి కట్టెలకోసం పంపబడిన నెత్రిబాకుల సేవకులిద్దరు కోయగూడెం ప్రజలందరినీ అక్కడికి తీసుకువస్తారు. వారినిచూసి నిక్షేపరాయుడు తమ కుట్ర భంగం కాకుండా, ప్రజలతో చెబుతాడు: గౌరి రాక్షసి అనీ, చందనరాజును ఆమెయే చంపి పీక్కుతినాలని చూస్తోందనీ, కనుక వారిద్దరినీ తగలబెట్టడమే మంచిదనీ. దీనికి ప్రజలు ఒప్పుకుంటారు. చితి పేర్చబడుతుంది. మృతుడైవున్న చందనరాజును, గౌరీని చితి ఎక్కిస్తారు.

గౌరి దేవతలను ప్రార్థిస్తుంది తనకు పతిభిక్ష పెట్టమని. ఆ సమయాన యీ అనర్థాలన్నిటికీ కారణభూతురాలైన చంచల ఇంద్రసభలో నాట్యంచేస్తూ వుంటుంది గౌరి ప్రార్థన దేవతలకు వినిపిస్తుంది. ఇంద్రుడు చంచల చేసిన నేరం గ్రహిస్తాడు. 'మానవులకు సహాయం చేయవలసిందిపోయి అపకారం చేస్తున్నావా?' అని దూషించి ఆమె దేవత్వాన్ని ఉపసంహరిస్తాడు. వెంటనే చంద్రహారం చందనరాజు మెడలోకి వచ్చేస్తుంది. అతడు లేచి కూర్చుంటాడు. ఈలోగా స్మృతి తప్పి పడిపోయిన మాలి స్మృతి తెలిసి లేచి, రాజుగార్ని సపరివారంగా వెంటబెట్టుకుని చితి స్థలానికి వస్తాడు. ధూమకేతువు దుండగం బయటపడుతుంది. 'ఇంకెప్పుడూ యిట్టి పని చెయ్య'నని లెంపలు వేసుకున్నమీదట అతన్ని అంతా క్షమించి వదిలిపెడతారు. గౌరి చందనరాజు సుఖంగా వుంటారు.

ఈ కథను చిత్రించడంలో విజయా వారు ప్రత్యేకమైన నైపుణ్యం చూపించారు. ప్రతి టెక్నికల్ శాఖలోను నిర్దుష్టతకోసం వారు పడిన శ్రమ, తీసుకున్న శ్రద్ధ ప్రతి అంగుళంమేరా ప్రతిఫలిస్తూ, యీ చిత్రాన్ని ఇటీవల భారతదేశంలో వచ్చిన చిత్రాలలో సాటిలేనిదిగా చేస్తున్నాయి. ఈవిధంగా బహుముఖ్యమైన నిర్మాణ కౌశలం, దక్షత చూపించే చిత్రం కనీసం దక్షిణ భారతంలో లేదనడం అతిశయోక్తి కాదు.

ముఖ్యంగా "చంద్రహారం" లో కొట్టవచ్చినట్లు కానవచ్చేది ఫొటోగ్రఫీ పనివాడితనం. దేవతలకు మనుష్యులకు సంబంధించిన యీ యితివృత్తానికి ఫొటోగ్రఫీ ద్వారా స్వాప్నికమైన వాతావరణం ఏర్పడింది. సన్నివేశానికి, పాత్రల స్వభావానికి అనువుగా లైటింగ్, ఆంగిల్స్ అమర్చుకుంటూ, ఒక్కొక్కచోట సంభాషణలుకూడా తీసుకురాలేని పుష్టి తీసుకువస్తూ ఫొటోగ్రఫీ నిర్వహించబడింది. పగటి వెలుతురు పగటి వెలుతురుగానూ, చంద్రకాంతి చంద్రకాంతిగానూ కనిపించడం ఎన్నదగిన విశిష్టత. రెండు నృత్య సన్నివేశాలున్నాయి. "చంద్రుడు - కలువలు" నృత్యం ఒకటి; ఇంద్రసభలో దేవకన్యల నృత్యం ఒకటి. ఈరెండూ ఆశ్చర్యకరంగా ఫొటో తీయబడ్డాయి. ఫ్రేములో సగం భాగం స్పష్టంగా, సగంభాగం అస్పష్టంగా కనిపించడానికి గాసు గాజు ముక్కపై 'గ్రీజ్' పూసి లెన్సుకు అడ్డంగా వుంచి బార్ట్లే యీ దృశ్యాలు ఫొటో తీశారట. ఇటువంటివే మరికొన్ని ట్రిక్కులు యీయన ఉపయోగించారు. చాలచోట్ల 'మాటొ షాట్లు' తీశారు. సెట్టు పూర్తిగా నిర్మించకుండానే పూర్తిగా నిర్మించబడిన భ్రాంతి

# "చంద్రహారం"

కలుగచెయ్యడం యీ పాటలలోని సౌకర్యం. దీనికి కళాదర్శకుడు గోఖలేగారి బాధ్యత కూడా కొంత వున్నది. తరవాత ఇంద్రసభ చూపించబోయే ముందుగావున్న నక్షత్ర ఖచితమైన అంతరిక్ష దృశ్యపు ముందుభాగంలో ఒక తోకచుక్క యిటునుంచి అటు క్షణంలో ప్రయాణం చేసిపోతుంది. కేవలం వాతావరణ చిత్రణ తప్ప మరేమీ ప్రయోజనం లేని యీ పాట కోసం బార్ట్లే చాలా శ్రమపడ్డారట. కవికి అందమైన పదగుంఫనం వల్ల కలిగే ఆనందం వంటిదే, టెక్నికల్ 'ఇన్వెన్షన్' వల్ల టెక్నీషియన్‌కి కలిగే ఆనందం.

ఘంటసాల సంగీత ప్రతిభ నేపథ్య వాద్యగానం కూర్చడంలోను, మూడు నాలుగు పాటల్లోను బాగా కనిపించింది. "ఇది నా చెలి, ఇది నా సఖి" అనేపాట, "ఎవటి నుంటినో సఖీ" అనే వొక పాటా ప్రేక్షకులను అలరించగల పాటలు. ... పాడిన పాటలుకూడా కర్ణరసాయనంగా వున్నాయి.

పింగళి నాగేంద్రరావుగారు సమయోచితమైన శైలిలో, ప్రేక్షకులను రంజింపజేసే హాస్యంతో సంభాషణలు వ్రాశారు. పాటల సాహిత్యం కూడా వారి పూర్వ ఘనతకు తీసిపోని విధంగా వున్నాయి.

గోఖలే, కళాధర్‌ల కళాదర్శకత్వం ప్రశంసనీయంగా వున్నది. కృష్ణయ్యర్ గారి సౌండు రికార్డింగు నిర్దుష్టంగా వున్నది.

విజయా వారి ప్రతి చిత్రంలోనూ ప్రత్యేకంగా పేర్కొనదగిన అంశం పాత్రసృష్టి. చిత్రవిజయానికి పాత్రలు ఎంత ప్రధానావశ్యకమో వారికి బాగా తెలుసు. 'షావుకారు' లో చాకలి, 'పాతాళభైరవి' లో మాంత్రికుడు, 'పెళ్ళిచేసిచూడు' లో వియ్యన్న మరపురానిపాత్రలు. అలాగే "చంద్రహారం"లో నిక్షేపరాయుడు పాత్ర ఒక నూత్నసృష్టి. నిక్షేపరాయుడు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే తెలివిగలవాడు "మనమేంజేస్తేఅది ఘనకార్యం" అని గర్వపడే రకం. ఎంత విషమపరిస్థితి ఎదురైనా, సమయస్ఫూర్తితో ప్రవర్తించగలవాడు. రంగంమీదికి ప్రవేశిస్తూనే ధూమకేతువును బుట్టలో వేసుకుంటాడు. "ముందు రమ్మనీ, వెనువెంటనే పొమ్మని! ఆహా ఏమి రాజనీతి" అంటాడు. ఇక నేం, పట్టాభిషేకం తప్పిపోయి రాజయోగం లేదేమోనని విచారిస్తున్న ధూమకేతువు వెంటనే బుట్టలో పడతాడు. ఇక ఆతరవాత నిక్షేపరాయుడు అనుకున్న ప్రతిపనీ సాధిస్తూ పోతాడు. ఆఖరున క్లైమాక్సులో మరీ ఘోరమైన దురంతం తలపెట్టేసరికి మాత్రం దేవతలు కలగజేసుకుని అతని పథకం తల్లక్రిందులు చేస్తారు. ధూమకేతువుకు ఆంతరంగిక మంత్రిగా ఉండి బహిరంగమంత్రి కావాలంటే ధూమకేతువు రాజవడం అవసరమని తలచి యితడు వేసే పన్నాగాలు యిప్పటి రాజకీయ నాయకులను జ్ఞాపకం చేస్తాయి.

నిక్షేపరాయుడు, ధూమకేతువు తప్పిస్తే మిగతా పాత్రల్లో చైతన్యం, మానవప్రయత్నం కొంత తక్కువ. 'పాతాళభైరవి'లో వలె కథానాయకుడు స్వయంగా సాహసాలు చేసి అనుకున్నదాన్ని సాధించడు. చందనరాజు పుట్టడమే చంద్రహారంతో పుట్టడం, గౌరికీ అతనికీ వివాహం జరగడం, చివరికి చితినుండి రక్షించబడడం యివన్నీ మానవాతీత శక్తుల ప్రభావంవల్ల జరిగినవే. అందుచేత చందనరాజు పాత్ర 'పాతాళభైరవి'లో తోటరాముడంత చైతన్యవంతమైనది కాదు. కాని ఇది మానవులకూ, దేవతలకూ సంబంధించిన కథ అని మొదటనే స్థాపించడం వల్ల కథ కొనసాగా మానవ, దేవతా సమ్మిళితమైనదిగానే జరిగిపోతుంది.

నటీనటులు తమతమ పాత్రలను సమర్థతతో నిర్వహించారు. ముఖ్యంగా శ్రీరంజని గౌరి పాత్రను ప్రశంసనీయంగా నటించింది. నిక్షేపరాయుడుగా జోగారావు నటించడంతో ఆ పాత్ర సాధారణమైన విలన్‌పాత్రగా తయారుకాకుండా, 'విలనీ'ని మెత్తబరిచే విదూషకత్వం కూడా చేకూరింది. ఎన్. టి. రామారావు, సావిత్రి, రేలంగి తమ పాత్రల్లో బాగా రాణించారు. శ్రీవత్స, ఋష్యేంద్రమణి, బాలకృష్ణ ముదలైనవారు సంతృప్తికరమైన నటన చూపారు. ఎస్. వి. రంగారావు అన్ని విజయా చిత్రాల్లోవలెనే యీ చిత్రంలో కూడా ప్రత్యేకతగల పాత్రనుధరించి ప్రేక్షకుల మెప్పు పొందగల విధంగా నటించారు.

ఈ చిత్రం విజయవంతమై, ఇంకా మంచి చిత్రాల నిర్మాణానికి విజయా వారిని ప్రోత్సహించగలదని ఆశిస్తున్నాము. ★



## 1953 చిత్రాలు

**జనవరి**

నా యిల్లు—అవరిండియా
పరదేశి—అంజలీ
జగన్మోహిని—మహాత్మా
నా చెల్లెలు—అశోకా

**ఫిబ్రవరి**

బ్రతుకు తెరువు—భాస్కర్
పోతరికం—గజానన్
పుట్టిల్లు—రాజా

**మార్చి**

అమ్మలక్కలు—కృష్ణా
గుమాస్తా—అరుణా

**ఏప్రిల్**

కన్నతల్లి—ప్రకాశ్
అమరకవి—నాగూర్ సినీ
తండ్రి—ఎక్సెల్

**మే**

ఇన్స్పెక్టరు—జూపిటర్

**జూన్**

వయ్యారిభామ—అజంతా
పరోపకారం—శోభా
దేవదాసు—వినోదా

**జులై**

ఒక తల్లిపిల్లలు—పక్షిరాజా
ప్రపంచం—సొసైటీ
పిచ్చిపుల్లయ్య— నేషనల్ ఆర్ట్
మంజరి—వరుణా ఎండ్ మహాత్మా

**ఆగస్టు**

చండీరాణి—భరణీ

**నవంబరు**

లక్ష్మి—రాజరాజేశ్వరి
పెంపుడుకొడుకు—ప్రసాద్ ఆర్ట్
ప్రతిజ్ఞ—రోహిణీ

**డిసెంబరు**

రోహిణి—మద్రాసు ఆర్ట్
పక్కయింటి అమ్మాయి—ఈసిండిగా
ప్రేమలేఖలు—ఆర్. కె.

•సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో చిత్రాలు విడుదల కాలేదు. సెప్టెంబరులో జెమిని వారి "అవ్వయ్యార్", డిసెంబరులో "అపేక్ష" తమిళ చిత్రాలు తెలుగు కామెంటరీతో విడుదలయినవి. ★

# ★ 1953 సింహావలోకనం ★

గత సంవత్సరం 27 తెలుగు చిత్రాలు విడుదలయినవి. తెలుగు చిత్రసీమకు సంబంధించినంతవరకూ యిది రికార్డు సంఖ్యే. ఈ 27 చిత్రాల్లోనూ 6 తప్ప మిగతావన్నీ సాంఘిక చిత్రాలే.

1952 లో విడుదలయిన పాతిక చిత్రాల్లోనూ 18 దాకా సాంఘికాలున్నాయి. ఆ సంవత్సరారంభంలో తెలుగు చిత్రాలను సింహావలోకనం చేస్తూ, సాంఘిక చిత్రాల సంఖ్య క్రమేపీ యెక్కువ అవుతుందనీ, జానపద చిత్రాల శకం అంతరిస్తున్నట్లేననీ మేము ఆశాభావం వెలిబుచ్చాము. ఈ ఆశాభావాన్ని 1953 వ సంవత్సరం భంగం చెయ్యలేదు. గత సంవత్సరపు జానపద చిత్రాలన్నీ పరాజయం పొందినవే. సాంఘిక చిత్రాలన్నీ ప్రజాదరణ పొందాయని దీనర్థం కాదు. వాటిలో సగానికి పైగా అపజయం పొందాయనేది నిర్వివాదం. బాగా విజయంపొందిన చిత్రాలు "నా చెల్లెలు" "బ్రతుకు తెరువు" "దేవదాసు" మాత్రమే కనిపిస్తున్నాయి. ఈ మూడింటిలోనూ "దేవదాసు" మాత్రమే అసమానమైన విజయం సాధించింది.

1954 లో కూడా తయారవుతున్న చిత్రాల్లో అత్యధిక సంఖ్య సాంఘిక చిత్రాలదే.

అయితే సంవత్సరారంభంలోనే విజయావారి బ్రహ్మాండమైన జానపద చిత్రం "చంద్రహారం" విడుదలవుతున్నది. ఈ చిత్రం ప్రేక్షకులను బాగా ఆకర్షించగలదని ఆశించడానికి అవకాశం వున్నది. చక్కని పనివాడితనం, షోమన్‌షిప్ కలిగిన యీ చిత్రం జయప్రదంగా నడిచినప్పటికీ దీని ప్రభావం యితర నిర్మాతలమీద ఎక్కువగా వుంటుందనలేము. పాతిక లక్షలు వ్యయంచేయడం, వ్యయానికి తగిన నిపుణత చూపడం ప్రతి నిర్మాతకూ సాధ్యమయ్యే పనికాదు. బహుశా విజయావారే ఇంత భారీఎత్తు చిత్రాలకు ఇకమీద పూనుకోకపోవచ్చును. "చంద్రహారం" తరవాత పౌరాణిక చిత్రం కాక "మిస్సమ్మ" అనే సాంఘిక చిత్రం తీయడానికి వారు నిశ్చయించారు. అందుచేత "చంద్రహారం" విజయం చూసి, అనుకరించేవారెక్కువ వుండరని నిస్సందేహంగా చెప్పవచ్చు.

గడచిన రెండుమూడేళ్లలో అనేక చిత్రాలు విపరీతంగా నష్టపోయాయి. ఈ నష్టానికి ఒక ముఖ్యకారణం నిర్మాణ వ్యయం పెరగడమేనని పలువురు నిర్మాతలు గుర్తించారు. ఇప్పుడు ప్రతివారూ సాధ్యమైనంత తక్కువ వ్యయంలో, వ్యవధిలో చిత్రాలు పూర్తి చేయడానికి ప్రయత్నిస్తున్నారు. నిర్మాతలు ఇదివరకువలె పెద్దతారలను పెద్ద రేట్లతో బుక్ చేసేస్థితిలో లేరు. ఈ కారణం వల్లకూడా, ముందుముందు సాంఘిక కథలకే గిరాకీ వుండవచ్చు.

గత సంవత్సరపు 27 చిత్రాలలోనూ దాదాపు 12 చిత్రాలు ఆంధ్రేతర నిర్మాతలు తీసినవి. వీటిలో "ఎన్‌తంగై" ననుసరించి తీసిన "నా చెల్లెలు" తప్ప మిగతావన్నీ నష్టపడినవాటిలోనే లెక్క. ఇవి వచ్చి, తెలుగు భాషలో చిత్రాల సంఖ్య ఎక్కువ చేసినందుకు సంతోషించవలసినదే. కాని తెలుగు ప్రేక్షకుల అభిరుచులతో గాని, తెలుగు చిత్రాల స్థాయితో గాని సరితూగలేని యీ చిత్రాలు ఏవిధంగా చూసినా మనకు గర్వకారణాలు కావు.

1953 లో చిత్రాలు విరివిగా నష్టపడడానికి మరొక ముఖ్యకారణం, పోటీ. నెలకు సగటున రెండుకంటె యెక్కువ చిత్రాలు విడుదలయినవి. యథార్థంగా నాలుగేసి చిత్రాలు విడుదలయిన నెలలు చాలావున్నాయి. ఈ విధమైన పోటీవల్ల పరిశ్రమ బాగా దెబ్బతిన్నది. అసలే ఆర్థిక మాంద్యం ప్రబలివుండడంచేత, సినిమాలు చూడ్డం తగ్గించిన ప్రజలు, యిన్నేసి చిత్రాలకు హాజరై వాటికి విజయం చేకూర్చడం అసంభవ విషయం. అచ్చగా తెలుగువారే నిర్మించిన ఏ పదిహేను చిత్రాలో విడుదలయివుంటే, యిప్పటికన్న బాగా సొమ్ముచేసుకొనేవనడం బేసబబు కాదు. చిత్రం విజయం దాని బాగోగుల మీదనే ఆధారపడివుండదు. పూర్వపు రోజుల్లో చిత్రాలు యిప్పటి వాటితో పోల్చదగినవి కాకపోయినా, సొమ్ము చేసుకునేవి. చిత్రాల సంఖ్య పరిమితంగా వుండడం, అసలు సినిమాలే జనులకు 'కొత్తవింత' కావడం వాటి విజయానికి కారణం.

ఇలాగ ఆలోచిస్తే, తెలుగు మార్కెటుకు ఏడాదికి 12 లేక 15 చిత్రాలకంటె యెక్కువ అక్కర్లేదేమో ననిపిస్తున్నది. చిత్రాల సంఖ్యనుబట్టి అభివృద్ధిని కొలవగూడదు. కళాకౌశలం ముఖ్యం; పరిశ్రమ సుస్థిరత ముఖ్యం; తయారైన చిత్రాలు విజయవంతాలు కావడం ముఖ్యం. అధికో[illegible] ఒక్కటే తారకమనుకుంటే, ఎప్పటికైనా 'డిప్రెషన్' ఎదుర్కోక తప్పదు. ఏడాదికి నాలుగువందల చిత్రాలు తయారుచేసే హాలీవుడ్ యిప్పుడు సరిగ్గా యిదే 'డిప్రెషన్' లో యిరుక్కొనివున్నది. ఇదివరకు ఏటా యిరవై పైగా చిత్రాలు నిర్మించే స్టూడియోలు యిప్పుడు సగానికి సగం ఉత్పత్తి తగ్గించుకొంటున్నాయి. పాతచిత్రాలనే తిరిగి విడుదలచేసి ప్రదర్శించడంద్వారా, థియేటర్లు రోజులు నెట్టుకొస్తున్నాయి.

ఈదృష్ట్యా చూస్తే, మద్రాసు సినిమా రంగంలో ద్విభాషా చిత్రాల ముమ్మరం తగ్గుముఖంపట్టడం మంచిచేసనాలి. ద్విభాషా చిత్రాలవల్ల నిర్మాతలకు కలిసివచ్చిందేమీ లేకపోయింది. పైగా తర్జుమా చిత్రాలమీద ఏవగింపు ప్రజల్లో గాటంగా నాటుకుపోయింది. గత సంవత్సరం అచ్చగా తెలుగులోమాత్రమే తయారైన చిత్రాలు అయిదున్నాయి. ఈ సంవత్సరం ఇటువంటి చిత్రాల సంఖ్య బాగా పెరుగుతుంది.

వినోదావారి "దేవదాసు" తెలుగులోనూ, తమిళంలోనూ కూడా విజయవంతమైనది. ఈ చిత్రవిజయానికి, కథ శరచ్చంద్రుడిది కావడం ఎంత కారణమో, దర్శకునియొక్క, నటీనటులయొక్క ప్రతిభ కూడా అంతే కారణం. ఎందుకంటే మంచి కథలు ఎత్తుకుని హాస్యాస్పదంగా తయారుచేసిన నిర్మాతలున్నారు. అలా కాకుండా కథను సులభగ్రాహ్యంగా, సూటిగా నడిపిస్తూ, పాత్రచిత్రణంలో శ్రద్ధ తీసుకుని నిర్మించిన "దేవదాసు" విజయం పొందడంలో ఆశ్చర్యం లేదు.

అచ్చగా సాంఘికమైన సమస్యనే తీసుకుని వ్యంగ్యమూ, హాస్యమూ ఉట్టిపడేట్లు నిర్మించబడిన "బ్రతుకు తెరువు" చిత్రం గత సంవత్సర చిత్రాల్లో మరొక ఎన్నదగిన విశేషం. మిగతా చిత్రాలు, జానపదాలయినా సాంఘికాలయినా అన్నీ ఒక మాదిరిగానే వున్నాయి. సందర్భశుద్ధిలేని ట్రీట్‌మెంటుతో, అవకతవక చిత్రణంతో వాటిలో చాలామటుకు లోపభూయిష్ఠంగా తయారైనాయి.

గత సంవత్సరంలో నాగేశ్వరరావు, సావిత్రి ఎక్కువ చిత్రాల్లో నటించడం,

(52-వ పేజీ చూడండి)

వచ్చుచున్నది

# రాజీ

నా ప్రాణం...

జెమినీ చిత్రం



(11-వ పేజీ తరువాయి)

కాని మీ మామయ్యకూడా నెతికొడుగా? ఆయనకూడా అంతేనంటావా?"

యీ అబద్ధం నేను ఎందుకు చెప్పానో నాకు తెలియదు. నాలో ఏరక్తం యీపని చేయించిందో చెప్పలేను. కాని ఎందుకో 'మామయ్య' యీపని చేశాడని చెప్పగల ధైర్యం నాకు లేకపోయింది.



కాని శాస్త్రి జీవాంతకుడు. వాడు చూసినట్టున్నాడు నేను పెట్టె తియ్యడం.

గిరి వెనక వరండాలో మామూలుగా సిగరెట్లు కాల్చుకుంటున్నాడు.

మామయ్య వచ్చాడు. రైలు టైమయి పోయింది గబగబా పెట్టె బెడ్డింగూ కూలివాడి నెత్తినబెట్టి 'నేను వెళ్తున్నానురా' అన్నాడు.

"మేమూ వస్తాం - మీకు తోడుగా స్టేషనుదాకా" అన్నాడు శాస్త్రి.

మేము ముగ్గురం బయలుదేరాం.

"రూములో జాగ్రత్తగా ఉండండి. ఈ వాచీ పోయిందని మీ నాన్నకి తెలిస్తే యింకేమన్నా ఉందా......" అని చెప్పి రైలెక్కాడు మామయ్య. గిరి నాకేసి, మామయ్యకేసి వింతగా చూశాడు. వాడి చూపులు నాకే అర్థమవుతాయి. వీడికూడా యీ సంగతి తెలిసి ఉంటుంది, అనుకున్నాను.

మధ్యాహ్నం నిద్రపోయి లేచేసరికి గిరి పెట్లో డబ్బు లెక్క పెడుతున్నాడు. ఎప్పుడూ లేనిద యిదేమిట్రా అనుకున్నాను.

"ఏరా! పొద్దున్నుంచీ నలభై రూపాయిలేం ఖర్చు పెట్టాంరా" అన్నాడు గిరి.

నాకు ఆశ్చర్యంవేసి..."తప్పు లెక్క పెట్టావేమో చూడవోయ్ బడుద్ధాయ్" అన్నాను.

నేను రెండు రూపాయిలు తీశానంతే.

"ఏమో - యిందులో 40 రూపాయిలు తక్కువొస్తున్నాయి. మొన్న నాన్న 150 పంపించాడు. మనం ఎంత గూచినా 20 కన్నా ఎక్కువ ఖర్చు పెట్టేఉండం. యిందులో 90 మాత్రం ఉన్నాయి...... చిల్లరకేమిటే." అని లెక్క చెప్పాడు గిరి.

శాస్త్రి సాదకోళంగా నిలబడి—

"నిన్నరాత్రి వాళ్ళ మామయ్యకి కావలిసొస్తే బదులిచ్చాడు లేవోయ్ - మరిచిపోయాడు" అన్నాడు గిరితో.

నాకు అప్పటికిగాని స్ఫురణకి రాలేదు, వాడి మాటల్లో వ్యంగ్యం. నా మొహం ముడుచుకుపోయింది, మామయ్య చేసిన పనికి.

"ప్రపంచంలో మామయ్యలు చేసిన పనులు దాగుతాయి...యీ పనే స్నేహితులు చేస్తే..." అన్నాడు గిరి. వాడు అసలు మాట్లాడడు. ఎప్పుడేనా మాట్లాడేడా గూఢులు మాట్లాడతాడు.

"ఆయనకి యింటి కెళ్ళాక గాని తెలియదు. మనకి ఆయన సంగతి తెలుసునన్న సంగతి.....మరచిపోయి వాచీ, అవసర మొచ్చి డబ్బూ తీసుకున్నాడు గాని, యింకేమన్నా అలాగ తీసుకుపోయిఉంటే మరచిపోకుండా పంపెయ్యమని రాయి." అన్నాడు శాస్త్రి...అనేసి "శ్రీరస్తు భవదంఘ్రి చికురంబులకు..." అంటూ పద్యం లంకించుకున్నాడు. మళ్ళా మా జీవితం ప్రారంభించామని చెప్పడానికి నాంది వాచకంలా వినిపించిందా పద్యం.



## 1953 సింహావలోకనం

(49-వ పేజీ తరువాయి)

తారలుగా ఉచ్చదశ అందుకోవడం జరిగింది. వీరు నటించిన రెండు చిత్రాలు "దేవదాసు" "బ్రతుకు తెరువు" శతదినోత్సవాలు చేసుకున్నాయి.

ఈ విషయాలు తప్పిస్తే, మొత్తంమీద 1953 వ సంవత్సరం ఆశాజనకమైనది కాదనే అనిపిస్తున్నది. 1953 లో నేర్చుకున్న పాఠాలు 1954 లో ఉపయోగపడితే పరిశ్రమ యిప్పటి మాంద్యస్థితినుంచి తప్పక తేరుకోగలదు. స్టూడియోల అద్దెలు సగానికి సగం తగ్గడం ఒక మంచి శుభసూచన. ఇది వరకు ఒక కాల్ షీట్‌కు అయ్యే ఖర్చుతో ఇప్పుడు రెండు కాల్ షీట్లు వస్తున్నాయి. తారల రేట్లుకూడా బాగా పడిపోయాయి. అభివృద్ధికిరాగల కొత్తతారలు పలువురు రంగంలో ప్రవేశించారు. రచయితలు, దర్శకులు యువకతరంవారనేకులు వచ్చారు. వృథాగా కాలమూ, ధనమూ ఖర్చుచేయకుండా చురుకుగా చిత్రాలు నిర్మించాలనే ధోరణి యెక్కువైంది. చిత్రాలసంఖ్య పరిమితం చేయడం ఎలాగూ అసంభవం కాబట్టి, తక్కువ వ్యయంలో తీయడం ఆదర్శంగా పెట్టుకుని నిర్మాతలు ముందుకువస్తే, ఈ సంవత్సర ఫలితాలు నిసటికంటే ఉత్సాహకరంగా ఉండగలవు.

అంజలీ పిక్చర్స్‌వారు తమ రెండవ చిత్రంగా ప్రసిద్ధ ప్రేమకథ "అనార్కలీ" నిర్మిస్తారు. కథ, మాటలు, పాటలు సముద్రాలవారు వ్రాస్తారు. అంజలీదేవి అనార్కలీగా, నాగేశ్వరరావు సలీమ్‌గా, ఎస్. వి. రంగారావు అక్బర్‌గా నటిస్తారట. సంగీతం ఆదినారాయణ రావుగారు సమకూరుస్తారు. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య. డిస్ట్రిబ్యూటర్లు పూర్ణావారు.

# ఘంటారావం

(25–వ పేజీ తరువాయి)

దైవప్రార్థనలు, శాస్త్రాధ్యయనంవల్ల అంతశ్శత్రువుల్ని జయించాను. స్త్రీవాసన తగలనియ్యలేదు. గ్రంథం తెరవగానే అపవిత్రమైన ఆలోచనలన్నీ పటాపంచలయ్యేవి. నాశాంతి, నా దాంతి నాకు తిరిగి లభించేవి. అప్పుడప్పుడు కొందరు కొందరు స్త్రీల ఆకారాలలో సైతాన్ నన్ను లోబరుచుకోడానికి ప్రయత్నించేవాడు. కాని సులువుగా సైతాన్‌ని జయించాను. కాని ఆ విజయం, ఆ నిగ్రహం నన్నిపుడు విడిచిపోయినాయంటే, దైవాన్నే నిందించాలి.

"ఒక రోజున నా గదిలో కిటికీవద్ద కూర్చుని చదువుకుంటున్నాను. అప్పుడు నా చెవులకు తంబుర వినపడింది. ధ్యానభంగమైనందుకు విసుగు పుటింది. వీథిలోకి చూశాను. అప్పుడా రోజున నా కళ్ళబడిన దృశ్యం మానవమాత్రులకు సాధారణంగా గోచరమయేది కాదు. మధ్యాహ్న వేళ ఆ ఎండలో అతిలోకసుందరి ఒక యువతి నృత్యం చేస్తోంది. ఆమె నాకళ్లకప్పుడు దివ్యలోకం నుంచి దిగివచ్చిన దేవతలా కనపడింది. ఆమె సుందర నేత్రాలలో ప్రకృతిశక్తి తాండవిస్తోంది. ఆమె మెడలోని పూసలు ఎండలో తళతళలాడాయి. ఆ ఆకారాన్ని భగవంతుడే మలిచినట్లుంది. ఆ సౌందర్యాధిదేవతను చూడగానే నా కర్మ పరిపక్వం చెందింది. నా శరీరం, నా మనస్సు నావశం తప్పాయి. ఆమె మానవాంగన కాదని తోచింది. ఆమెపక్క మేక ఒకటి కనపడింది. అది చూడగానే అది మంత్రాలకు లోబడినదని తోచింది. ఆమేక నన్ను చూసి నవ్వింది. నవ్వింది మేక కాదు, సైతాన్ అని నాకు తెలుసును. అప్పుడు నాకు బోధపడింది, నువ్వు మనిషివి కాదని. నన్ను నరకంపాలు చెయ్యడానికి సైతాన్ పంపిన జ్వాలవని తెలుసుకున్నాను. ఇప్పుడూ అదే నా నమ్మకం. నాపైన నీ రూపం అమోఘంగా పనిచేసింది. నిన్ను చూడగానే చిరునవ్వుతో వరకానికి పోవచ్చనుకున్నాను. తరవాత నీ పాటలో లీనమైపోయాను. ఏం చెయ్యను? అక్కడనుంచి పారిపోలేను. నువ్వు వెళ్ళిపోయేవరకూ అక్కడే స్తంభించిపోయాను. నా కాళ్లు మంచులా చల్లబడిపోయాయి; నా తలలో జ్వాలలు మిన్నుముట్టాయి. అదిమొదలు ఆ అపూర్వ దృశ్యం తప్ప నా కంటికింకొకటి కనిపించడంలేదు. ఆగీతం తప్ప మరేదీ వినిపించడం లేదు. నేను పతితుడనైనాను.

"ఆరోజు మొదలు నాకు తెలియని విచిత్ర శక్తి ఏదో నన్నావహించింది. ఈ శక్తిప్రభావంనుంచి తప్పించుకోవాలని అనేక మార్గాలాలోచించి, అనుసరించాను. కాని నా కృషిఅంతా వ్యర్థమయింది. పుస్తకం తెరిస్తే నువ్వు ప్రత్యక్షం. ఎవరు కనపడినా నువ్వే నా కన్నులముందు సాక్షాత్కరించావు ఎవరే పలుకు పలికినా నీ కంఠమే నా చెవులలో గింగురుమంది. నేను నీలో లీనమైపోయాను. నిన్ను చూడాలని, నీ కంఠం వినాలని, నిన్ను తాకాలని—ఈ కోర్కెలు తప్ప నాకు మరొక ఊహా, ఆలోచనే లేదు. నీకోసం నగరమంతా చూశాను. నిన్ను అనేకమార్లు చూశాను. చూసినకొద్దీ తృష్ణ ఎక్కువయింది. నువ్వెవరో తెలుసుకున్నాను. జిప్సీవని తెలిసింది. ఇంక నువ్వు మంత్రకత్తెవనే స్థిరపరుచుకున్నాను. నీ మంత్రశక్తి భేదించాలని అనేక యత్నాలు చేశాను.

"ఒకరోజున ఒక ఆలోచన కలిగింది. నిన్ను ఎత్తుకుపోవాలని తోచింది. ఒకరోజు రాత్రి అలా ప్రయత్నించాను. నా కూడా మరొకడు వచ్చాడు. నువ్వు చిక్కావు. ఎత్తుకుని పోతుండగా దరిద్రుడు ఆ కెప్టెన్ అడ్డువచ్చి పడగొట్టాడు. దాంతో అతనికీ నీకూ నాకూ తిప్పలు ప్రారంభమైనాయి. నిన్నుగురించి



అధికారులికి తెలియపరిచాను. ఆ విధంగానైనా నువ్వు నాకు చిక్కుతావని ఆశపడ్డాను. కారాగారంలో నిన్ను పొందవచ్చును. అక్కడ నువ్వు నన్ను తప్పించుకుపోలేవు. ఒక దొక గుప్తకృత్యం తలపెట్టిన తరవాత, అది సగంలో ఆగిపోదు. దుర్మార్గం భీభత్స స్థితిలో ముగిసింది.

"ఆ తరవాత నన్ను నే నింక నిగ్రహించుకో లేకపోయాను. మనిషికంటె విధి బలవత్తరమైనదని తెలిసివచ్చింది. ఆ దుష్టవిధే నిన్ని కారాగారంలో పడవేసింది.

"తరవాత కొన్నిరోజులకి ఒకరోజు ఒకడు కనపడ్డాడు. నీ పేరుచెప్పి పకపక నవ్వుతున్నాడు. అతణ్ని ఎంబడించాను…"

"ఓ! ఎవరు? ఫీబస్!"

హఠాత్తుగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు సుతాధికారి. "ఆ పేరుమాత్రం చెప్పకు. నీ నోటితో అనకు. అది విని నేను భరించలేను. ఆ పేరే మనకీ దుర్గతి తెచ్చిపెట్టింది. నువ్వు బాధలు పడుతున్నావు. నాకు తెలుసును. ఈ బందిఖానాలో నువ్వు చలితో బిగుసుకుపోతున్నావు. ఈ చీకటిలో నీ కళ్లలో తేజస్సు నశించింది. ఈ కూపం నిన్ను పొదివిపట్టుకుంది. అయినా ఆ నీచుడి పట్ల అమాయకపు ప్రేమ నిలుపుకున్నందువల్ల, నీలో లోలోపల



# ఘంటారావం



ఎక్కడో కొద్ది కాంతి ఇంకా మిగిలివుంది. కాని నా హృదయమే ఒక అంధకారకూపమైపోయింది. నే నెంత బాధపడ్డానో నీకు తెలుసా? నిన్ను విచారించే సమయంలో నేను న్యాయసభలో నే ఉన్నాను. నే నక్కడే ఉండి అంతా చూస్తూ నరకయాతనలకు గురైనాను. ఆ పశువు నిన్ను ఈడ్చుకుపోవడం కళ్ళారా చూశాను. అక్కడ ముదులాలికే నీపాదాన్ని పట్టి లాగడం చూశాను. నీ అరుపు విని బాధ భరించలేకపోయాను. కత్తితో రొమ్ములో పొడుచుకున్నాను. ఇదిగో చూడు; ఇంకా గాయం నెత్తురు చిందుతూనే ఉంది."

క్లాడ్ ఫ్రాలో దుస్తులు తొలగించి ఛాతీ చూపాడు. పులి గోరుతో చీల్చినట్లు గాయం స్పష్టంగా కనపడింది. ఆమె భయంతో వెనక్కు ఒరిగింది.

"నిన్ను బ్రతిమాలుతున్నాను. నాపైన కరుణ చూపు. నువ్వు యాతన లనుభవిస్తున్నా ననుకుంటున్నావు. కాని యాతనంటే నిజంగా ఎలా ఉంటుందో నీకు తెలియదు. మతాధికారినైకూడా ఒక స్త్రీని ప్రేమించి, ఆమె ద్వేషానికి గురైన నా సంగతి ఆలోచించు. నీ ఒక్క చిరునవ్వుకోసం రక్తం ధారపొయ్యడానికి వెనుదియ్యను. నీకోసం సర్వస్వం త్యజించగలను. నీ పరిష్వంగం కోసం ప్రాణమైనా త్యజించగలను. అయినా నువ్వు ఆ నీచ యువకుని కోసం తపించడం, నన్ను చూసి భయంతో, ద్వేషంతో దూరంగా తొలగిపోవడం ఇంతకంటె మించిన యాతన ఈలోకంలో ఉందా? ఇంతకంటె నన్ను అంపంతో కోసినా బాధపడను. నన్ను కరుణించు. ఒక చేత్తో హింసించినా, ఒక చేత్తో నన్ను ఆదరించు. అది చాలు నాకు."

క్లాడ్ ఆవేదనతో నేలపై తలకొట్టుకొని తేమలో దొర్ల నారంభించాడు. యువతి అలా అతన్ని చూస్తూ కూర్చుంది. అతడి ఆత్మవేదనఅంతా విని "ఫీబస్! ఫీబస్!" అని మననం చేసింది.

క్లాడ్ మోకాళ్ళపై ప్రాకుతూ ఆమెను సమీపించాడు. "నిన్ను ప్రార్థిస్తున్నాను. నన్ను నిరాకరించకు. నిన్ను నా ప్రాణంగా ప్రేమిస్తున్నాను. నరక వేదన అనుభవిస్తున్నాను. నువ్వా పేరు పలికితే నన్ను ద్వేషజ్వాలలు దహించివేస్తున్నాయి. నా మొర విను. నన్ను అంగీకరించు. నన్ను అంగీకరిస్తే మనం ఎంత ఆనందంగా ఉండగలమో మాటలతో చెప్పలేను. మనం పారిపోదాం. నిన్ను ఖైదునుంచి విడిపిస్తాను."

ఎమరాల్డా నవ్వింది. "చూడండి; మీ వేళ్ళకి రక్తం." అంది.

క్లాడ్ దిగ్భ్రాంతుడైనాడు. తన వేళ్ళవంక చూసుకున్నాడు. "అవును. నన్ను చూసి నవ్వు, హేళనచెయ్యి. కాని నా వెంట రా. మనమింక కాలం వ్యర్థపుచ్చకూడదు. రేపే, రేపే పారిపోదాం. లేకపోతే రేపే నిన్ను ఉరితీస్తారు. అది నేను భరించలేను. నిన్ను బండిపైనకట్టి వీధుల్లో లాక్కుపోతారు. అయ్యో! నిన్ను నే నెంత ప్రేమిస్తున్నానో నువ్వు తెలుసుకోలేవు. నాతో వచ్చెయ్యి. ఆ తరవాత నువ్వే ఆలోచించి ఒక నిశ్చయానికి రావచ్చు. నన్ను నువ్వు ద్వేషించినా నేను బాధపడను. నాతో మాత్రం రా. రేపు ఉరినుంచి తప్పించుకో."

ఉన్మత్తునివలె క్లాడ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆ ఉద్రేకంలో ఆమెను కారాగారంనుంచి నడిపించుకు వెళ్ళిపోయేవాడే. కాని ఆమె అతనివంక తీక్షణంగా చూసింది. "నా ఫీబస్ ఏమైనాడు?" అని అడిగింది.

"అయ్యో!" అన్నాడు క్లాడ్. ఆమె చెయ్యి విడిచిపెట్టేశాడు. అతని సత్తువ ఉడిగిపోయింది. "నీకు నామీద జాలిలేదా?" అన్నాడు నిస్పృహతో.

"ఫీబస్ ఏమైనాడో చెప్పండి" అంది.

"చచ్చిపోయాడు" అన్నాడు క్లాడ్.

"చచ్చిపోయాడా! అయితే నన్నింక బ్రతకమ నెందుకు చెప్పడం?"

అతని కా మాటలు వినపడలేదు. పిచ్చివాడైపోయాడు. తనలో తను మాట్లాడుకుంటున్నట్లు అన్నాడు: "అవును. చచ్చిపోయే ఉండాలి. చచ్చే దెబ్బ పొడిచాను. కత్తి గుండెల్లో దూసుకుపోయేలా పొడిచాను"

ఆడుపులిలా ఆమె అతనిపైబడింది. మెట్లమీదికి అతన్ని గెంటివేసింది. "పో! రాక్షసుడా! నాముందునుంచి పో. నన్ను చచ్చిపోనీ. నీతో నాకెన్నడూ పొత్తు కుదరదు. ఫీ. పో ఇక్కడనుంచి" అని అరిచింది.

క్లాడ్ మెట్లపై తూలిపడ్డాడు. మెల్లిగా లేచి దీపం అందుకున్నాడు. మెట్లెక్కి తలుపు తెరిచాడు. ఆమె అతనివంక తదేకంగా చూసింది. ద్వారం దాటాడు. తిరిగి లోపలికి తొంగిచూశాడు. ఉబికివస్తున్న కోపం అణుచుకుంటూ "నే చెప్తున్నా విను. వాడు చచ్చాడు"

ఆమె బోరగిల పడిపోయింది. తరువాత గది అంతా నిశ్శబ్దం, చీకటి ఆవరించాయి.

(ఇంకా వుంది)



# అంతా దండుగే



(18-వ పేజీ తరువాయి)

అంటే పిలకపట్టుకుని బండిలోనుంచి క్రింద కీడ్పిస్తాను, మా అబ్బి గాడితో చెప్పించి.

క: ఏంటండో! ఇది మీయిల్లన్నట్టు మాటాడుతున్నారు. మీ అబ్బి గాడితో చెప్పి ఈడ్పిస్తామంటున్నారే.

ఆయన రైల్వేమంత్రేంటి బాబూ!

బ: నోర్ముయ్! అడ్డమైన ముష్టివాళ్లు బళ్లల్లో కెక్కి పిచ్చిపాటలు పాడితే ఈడ్పిస్తానా! మానానా! ఆడవాళ్లుంటారనైనా చూసుకోవద్దూ?

కు.రా: ఈడ్పించండి; చూస్తాను ఎలా ఈడ్పిస్తారో!

బ: నే నెవడినో తెలుసా?

క: ఓ తెలియకేం! మిమ్మల్నే తెలీదా! తాతగారూ! (అంతా గొల్లున నవ్వుతారు)

బ: రైలు మేష్టర్నే ధిక్కరించిన, నువ్వు ఎవ్వరైనా అంతే- ప్రక్కనే ఉన్నాడు. స్టేషన్ రానీ! ఈ అరాచక మేవిటో చెప్పి దవడపుద్ది చేయిస్తా. టిక్కట్లు లేకుండా రైళ్లల్లో ఆడపిల్ల లున్నారనేనా చూసుకోకుండా ముష్టిపాటలు పాడి...... వీడి దుర్దశ మేవిటో తేల్చేస్తాను.

క: ఆ చాలు; చాలు; చాలించండి. స్టేషన్ మేష్టర్. స్టేషనుమాష్టరంటే కలక్టరనుకుంటున్నారు కాబోలు. టిక్కట్లు లేనివాళ్లదగ్గర డబ్బులు తడుముకొని జేబులో వేసుకొని; గేటు దాటించేయటానికి ఇది స్టేషను కాదండీ - ఇది బండీ.

ఇదెక్కడానికి అందరికీ హక్కుంది. టికట్ కలక్టరొస్తే అడగమనండి వారికి చెప్తా జవాబు. లైసెన్సున్నంతకాలం, మీ అబ్బాయికాదు - ఇంద్రుడొచ్చినా ఏం చెయ్యలేడు. (తిరిగి పాట) "పట్నాల పల్లెల దేశ దేశాలంట - మన పేరు చెప్పుకుని ప్రజలు సుఖపడంగ- ఇంటా బయటా - జంట కవులవలె అంటుకు తిరగాలోయ్

కంటిపాపవలె దంపతు లెపుడూ చంటి పాపలను సాకాలోయ్"

"బాబూ-పెళ్ళిచేసి చూడు; సంసారం; మాయలమారి; అన్, బర్నాత్, టింగ్ రంగా, ఘంటసాల పాటల పుస్తకాలు బాబూ; అన్నీ అప్టూడేట్; సినీమా పాటల పుస్తకాలు, పుష్పవిలాపం కేడా. ఎవరికి కావాలి?"

ప్రయా: ఓయ్ అబ్బాయ్; పెళ్లిచేసి చూడు కావాలియ్యి!

ఇంకో కావిడ: ఓయ్; నాకూ ఒక పుస్తకం ఇయ్యవోయ్ - బేడేనా?

కు: అవునమ్మా! దాని సారం తెలిసిన బాబులు ఎంతైనా ఇచ్చి కొంటారు. అందులో పాటకో లక్షరూపాయలు ఖర్చు పెట్టారు. తాతగారి కేం తెల్సు వాటి మజా. ఇలాంటివారు లక్షమంది పోకిరీపాటలంటే సరా!

బ: మళ్ళీ ఇందాకట్లా పేలు!

పో: అబ్బ ఎందుకండీ వాళ్ళతో మనకి పేచీ!

ప్రక్కనున్న ప్రయాణీకుడు కవి: అయ్యో! తమకాగ్రహం కల్గించిన విషయం పాటా? లేక ఇంతకూ కుర్రాడా? ఏదో చెప్పలేని నిగూఢమైన బాధ అనుభవిస్తున్నారు కిమరు. చూస్తే నాకూ కష్టంగానే ఉంది. కాని పరుగెత్తే ప్రవాహాన్ని అడ్డుపెట్టలేము. ఆ కుర్రాడికిది భుక్తిమార్గం; అంచాత వాడు పాడినది వాడి స్వంతం కాదు వాడు పాడుకుంటూ నాలుగు పుస్తకాలమ్మకుంటే గానీ నాలుగు పైసాలు రావు. దారియ్యండి బాబూ! నా సూట్‌కేస్ తీసుకుంటా. విజయనగరం స్టేషన్ వచ్చేసింది. (రైలాగుతుంది.)

టిక్కట్ ఇన్‌స్పెక్టర్ ప్రవేశం: (తొందరగా) టికట్ - టికట్ ప్లీజ్. (రైలు కదుల్తుంది)

సూ: నాకు లేదండి.

పో: నాకూ లేదండి.

బ: లేదేవిట్రా - మన కెందుకర్రా టిక్కట్లు?

టి. ఇ: అయితే మీ ముగ్గురకూ టిక్కట్లు లేనట్టేనా?

బ: ఆహా! లేవు మేము ముగ్గురమే కాదు - మా పెళ్ళివారెవరికి లేవు. అవతలకూర్చున్న ఆ గుర్రాజూ, మా రత్తాలూ, సుబ్బులూ, కనకమ్మా, బాలమ్మా, నరసింహయ్యా; చెంచయ్యా; వగైరాలంతా మావాళ్ళే.

టి. ఇ: ఇంతకూ మీకు టిక్కట్లు లేవన్నమాట?

బ: లేవన్నమాటేవిటండీ! మాకసలు అఖ్ఖర్లేదు - మా అబ్బిగాడు స్టేషన్ మేష్టరీ చేస్తూంటే మా కెందుకండీ - మేమేం పరాయివాళ్ళమా? మేమూ, మీరూ, సర్కారువాడి నౌఖరీచేస్తూ ఏదో పెళ్ళికోసం వెళుతూ టిక్కట్లుకూడా కొనాలీ; ఈ భాగ్యానికి.

టి. ఇ: అదంతా నాకనవసరం; ప్యాసుందా?

బ: పేసేవిటో! గోడవేవిటో, నాకేం తెలీదు - స్టేషనొచ్చాక మీరూ మా అబ్బిగాడూ మాట్లాడుకోండి.

టి. ఇ: మీ రెక్కడనుంచొస్తున్నారు?

బ: అబ్బ! ఇదేం ప్రశ్నలండి? ఇంక ఏవూ రెళతారనికూడా అడుగుతారు కాబోలు! శుభమా అంటూ పెళ్ళికి వెడుతూంటే - బయలుదేరింది "సిగడాం" స్టేషన్ వెళ్ళేది విశాఖపట్నం - దివాను బాద్దూర్ చెంగయ్యగారి అమ్మాయిని మా అబ్బిగాడికి......

టి. ఇ: (అర్ధోక్తిలోనే అందుకొని) చాలించండి లెక్చర్ - టిక్కట్లు లేకుండా ఎంతమంది బయలుదేరారు?

బ: అంతా ఎంతండీ? మొత్తం నలభై!

టి. ఇ: సరే! మొత్తం నలభై అయితే (ఆలోచించి) ఊఁ! మొత్తం రెండు వందల యాభై ఎక్స్‌ఫేర్‌తో చెల్లించాలి. ఇస్తారా?

బ: ఇవ్వడానికి నేనెవణ్ణి; పుచ్చుకోడానికి మీరెవరు? అంతా అబ్బిగాడిదే పూచీ.

పుస్తకాల కుర్రాడు: (పాట)

"ఏమిటె నీ రభసా!
మనసులోని మనసా! ||ఏ||
యిల్లలికిన పండుగటే!
వళ్లు తెలిసి మెలగరటే!"

టిక్కట్లు లేకుండా రైలెక్కి, పిలకపట్టుకు ఈడ్పిస్తారుట- తాతయ్యగారూ! తాతయ్యగారూ!

[ట్రయిన్ స్టేషన్లో ఆగుతుంది. కోలాహలం.]

ఫ్లయింగ్ స్క్వాడ్: కమాన్, మీ టిక్కట్లు చూపండి!

బ: లేవని ఇదివరకే చెప్పానండి, ఆ కాకీ కోటు పెద్దమనిషితో—

ఫ్ల-స్క్వాడ్ అధికారి: ఊఁ స్టేషన్లోకి నడవండి.

ఏకాం: (ఒగర్చుకుంటూ-దూరంనుంచి పరుగెత్తుకొస్తాడు. తడబడుతూ) నీళ్లు మా

వాళ్లేనండి సార్ - ఐయామ్ - ఐయామ్ది - ఏ...యస్ యమ్...

ప్లె-అధికారి: అబ్బ మా కింగ్లీషు రాదులెండి - తెలుగులో చెప్పండి!

అందులోనే ఒకరు: ఇంతకూ మీకు టిక్కెట్లు ఉన్నాయా లేవా?

ఏ: లేవు సార్!

ఇంకొకరు: టిక్కెట్ లెస్ ట్రావెలింగ్ సంగతి తెలుసా?

ఏ: నేను ఏ. యస్. యమ్. నండి!

ఒకరు: ఓ అదా! ఫాల్సు ప్రెస్టేజ్! ఏ. యస్. యమ్. అయితే టిక్కెట్ లేకుండా ప్రయాణం చేయడానికి ఇది మన బాబుగారి బండా? స్పోర్టింగ్ జర్నీ ఎక్కడ?

ఏ: సిగడాం ప్లీజ్!

అధికారి: మనకు మిగతా విషయాలు అనవసరం - బరంపురంనుంచి ఎక్స్‌ప్రెస్ ఫేర్ చెల్లించమనండి. రెండువందల యాభై— ఊ! గో అన! పే చేస్తారా?

బ: బాబూ! తమతో మాకు ఘర్షణేవిటి? ఏదో పెళ్ళివారం - బండి తప్పితే ముహూర్తం తప్పిపోతుంది. ఏంటో ఈ లగ్గ రాసికి అన్నీ విఘ్నాలే - క్షమించండి బాబూ, టిక్కెట్లు కొనకపోవటం పొరపాటని ఇప్పుడు తెలిసింది - ఓ పది రూపాయలు తీసికోండి - లేంటే మీరుమాత్రం పరాయివారా! అంతా సర్కారు మనుష్యులే - ఇందండి బాబూ! ఏదో పెద్దముండావాణ్ణి - మీరూ నా పిల్లలలాంటి వాళ్లు వినండి బాబూ!

అధికారి: హూ ఈజ్ హీ?

ఒకరు: ఇతనా! ఎ. ఎస. ఎమ్. ఫాదర్ సార్.

అధికారి: మీరు పెద్దవారు కనక సరిపోయింది తాతగారూ! ఈ మాటే ఇంకొకరంటే.....(కోపంతో) వాట్?..... ఏ. యస్ యమ్? పే చేస్తావా? జి. ఆర్. పి. కి ఫోను చేయాలా?

బ: నా రవ్వరా అబ్బీ?

ఏ: గవర్నమెంటు రైల్వే పోలీసులు.

బ: వాళ్లెందుకు బాబూ ముక్క? సరే ఏదో ప్రార్థించాం - బాబూ నాయనా అని కాళ్లా కాళ్లు పట్టుకొంటే - మీరు మిక్కిలి పోలీసులంటున్నారు - తినండి నాయనా, మా సొమ్ము - మీకెం జయం అవుతుందో (అంతా నవ్వుతారు).

బ: నాయనా! నరసింహయ్యా! అంతా దండుక్కు వచ్చింది. ఊ! పారెయ్యక పోతే తప్పుతుందా? పారెయ్యండి - ఇంత కాలం జోరా అనిపించుకొని, ఇప్పుడు పోలీసువాళ్ల చేతకూడా చెప్పించుకోనా! ఈ భాగ్యానికి! ఏం కర్మ ముచ్చింది!

నరసింహయ్య: ఇందండి బాబూ!

బ: బాబూ తమ సొమ్ము తమకు ముట్టినట్లేనా? బండి కదిలిపోతుందేమో! నాయనా; జాగ్రత్తగా పిల్లపిచ్చికల్ని ఎక్కించు - సామాను భద్రం - బాబూ సెలవు తీసుకుంటాం—

అధికారి: ఏమండోయ్; తాతగారూ! ఎక్కడికెంటి? అంతఫోర్సు - ఇందండి ఈ రసీదుంచండి.

బ: రసీదుకేం భాగ్యం - మా కవతల బండీ తప్పితే—

అ: ఎక్కడికెళుతున్నారు?

బ: అన్నంతపనీ అయింది? విశాఖపట్నం బాబూ - విశా—

అ: ఇప్పుడు మీరు కట్టినది విజయనగరం వరకే - విశాఖపట్నానికి కాదు. తెలుసా?

బ: ఇంత సొమ్ము విశాఖపట్టానికి కాదూ?

అ: కాదు - ఇందండి రశీదు - ఇది లేకపోతే ఇంతా మళ్ళీకట్టాలి (స్టేషన్లో గంట కొడతారు)

బ: నాయనా! అబ్బీ! ఎలా చచ్చేదిరా! నా చావుకొచ్చిందిరా ఈ పెళ్ళి - పైగా ఎంతవుతుందిరా?

ఏ: త్వరగా తీయండి డబ్బు - నలభై.

బ: నలభయ్యే!

ఏ: ఊఁ త్వరగా - ఆలోచిస్తే బండి కదులుంది. మీ రెక్కిపొండి, నే తెస్తా టిక్కెట్లూ (ఏకాంబరం పరుగుతీస్తాడు)

బ: ఏవిటో అంతా దండుక్కు వచ్చింది- ఈ గుంట సచ్చినాడు మతిపోయి చూస్తాడేవిటిరా నరసింహయ్యా? పెళ పెళమని నాలుగు ఇంగిలీషు ముక్కలు దంచేస్తే వాళ్లు మళ్ళీమన్ని టిక్కెట్లు అడుగుతారూ?

నర: ఊరుకో బావా! నీ చాదస్తం అసలు కల్లోకూడా అనుకోలేదు, ఇ- ఇవాళ వీళ్ళొంటారని - యమభటుల్లె - తప్పించుకోవచ్చుగానీ, వీళ్లని తప్పించకోవటం మనతరంకాదు. అట్టే పేలి ఎగూకి రాస్తారు. దాంతో అబ్బిగాడి ఉద్యోగం ఊడుతుంది - మొదటే కొంటే నూరురూపాయలతో వదిలేది - మనవాడికి అహంభావం హెచ్చు - రైల్వే న . చేసి సంతమాత్రాన ఇంతమందీ ఎగబడితే ఏమవుతుంది. (మళ్ళీ స్టేషన్లో గంట మోగుతుంది)

బ: (ఆత్రుతతో) అబ్బిగాడు రాలేదం చెప్మా?

న: అదుగో పరుగెట్టుకొస్తున్నాడు.

(ఆఖరు గంటా - ఇంజను కూతా - గార్డు ఈలా—)

బ: రా, రా (కేక)

ఏ: (ఆత్రుతగా రైలెక్కి) అంతా ఎక్కినట్లేనా?

బ: ఆ! ఎక్కినట్లే. (బండి కదులుతుంది) అయిం దేదో అయింది - అంతా దండుగే అయింది - గానీ ఈ భోగట్టా విశాఖపట్నంలో జారనివ్వకండి.

[చిడతల చప్పుడు]

ముష్టివాళ్ళు:

"జీవు లెనుబదినాల్గు నచ్చలు
సావు పుట్టుగు లిక్కడా!
ఎవరు నేసిన పాపకర్మము
లనుభవించే దక్కడా!—" ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras